# జడభరతుఁడు

[పద్యకావ్యము]



రచయిత:

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

# జడభరతుఁడు

రచయిత;

దువ్వూరి సూర్యనారాయణశాస్త్రి.

1950



[వెల రు 1-50

## ఈశ్వరస్తుతి.

అమలగోదావరీతటప్రాంతసంస్థ
మస్కరపురీవరాంగణమందిరమున
నీడుజోడుగ భ్రమరాంబఁ గూడి యున్న
యఖిలలోకేశు మల్లేశు నభినుతింతు.

## గురునతి.

త్రయిని మూర్తిత్రయిని మునిత్రయిని బోలి
సారవిజ్ఞానభిక్ష నొసంగి యుద్ధ
రించి నన్నొకపాటిఁ గావించియున్న
నాగురుత్రయమునకు వందన మొనర్తు.

# మున్నుడి

ఈ జడభరతుఁడు నారచించినపద్యకావ్యములలో రెండవది. నా మొదటికబ్బము జీమూతవాహనుఁడు. అది ప్రథమప్రయత్నమైనను వస్తునాయకగౌరవాతిశయమువలన ఆంధ్ర, మదరాసు, ఒరిస్సా, విశ్వవిద్యాలయములవారిమన్నన పొంది బి. ఏ. ఇంటరుతరగతులకు పఠనీయగ్రంథమైనది. తత్ప్రోత్సాహకలనము నా హృదయమును మరల ప్రేరేపఁగా ఈ రెండవయత్నము గొనలుసాగినది. ఇందెంతవఱకుఁ గృతకృత్యుఁడనైతినో విజ్ఞులు తెలియఁగలరు.

"వాక్యం రసాత్మకం కావ్యమ్" అను ప్రాచీనాచార్యుల నిర్ణయమునుబట్టి యిదియుఁ గావ్యకక్ష్యలోఁ జేరఁగలదని విశ్వసించుచున్నాను. విశేషించి యుత్తమశ్లోకుని చరిత్రగదాయిది.

ఈ జడభరతోపాఖ్యానము చాలవఱకు భాగవతము, విష్ణుపురాణముల ననుసరించి సంతరింపఁబడినది. ఇందలి యొండు రెండు విషయములుమాత్రము భాషాంతరగ్రంథముల ననుసరించినవి. కథాసందర్భములు రసోచితముగఁ బెంచఁబడినవి. భరతుఁడు రహూగణమహారాజునకుబోధించిన విపులమైన వేదాంతవిషయ మౌచిత్యము ననుసరించి తగ్గించి వ్రాసితిని. మూలగ్రంథములందలి పదిపండ్రెండుగీతములనుమాత్రము

ఇచ్ఛాపూర్వకముగగాని సందర్భముల గ్రహించి వాని ననుక రణచిహ్నములం దుంచితిని. రసానుగుణ్యముగా సంవిధాన నిర్మితి కావించితిని. కావ్యమువినిన సహృదయులు బాగున్నది అన్నారు. మిత్రులొకరు దీనిని ముద్రింపించినారు. తిరిగి యీకావ్యమును భాషాభిమానులగు సహృదయుల కందింప సాహసించితిని.

ఇందుఁ దెలిసినంతవఱకు అప్రయుక్తములు దొరలనీయ లేదు. పానీయముతోపాటు పాత్రకూడ మంచిదైన మఱింత హితవుగానుండుట సహజముగదా? "బ్రాహ్మణకదళి, భర తము పట్టించు" వంటివి గ్రాంథికత్వమునకు లోటుకూర్పని జాతీయములని వాడితిని. ప్రాక్కవిప్రయోగప్రసిద్ధములైన కొన్ని దేశీయములను జాతీయములనుగూడ వలసినపట్టుల వాడుకొన్నాను. క్రొత్తప్రాతల కలయికకై కొంత పాటుపడి తిని. ఇంచుక్క కలియుపట్ల నుభయయుతి వాడితిని.

"గుణదోషౌ బుధోగృహ్ణన్" అనున్యాయమును స్మరించి నన్ను నిండుపఱచుటకై పెద్దల సవినయముగ నభ్యర్థించు చున్నాఁడను.

సుధీవిధేయుఁడు,

సూర్యనారాయణశాస్త్రి.

# జడభరతుఁడు

## ప్రథమబింబము

శ్రీకరం బయి, విబుధసంసేవిత మయి
లలితకళలకు శోభననిలయ మగుచుఁ
బూవుఁదోఁట లారామముల్ పొలుపు గూర్ప
నుండె నజనాభ మను దేశ ముర్విలోన.

పాఁడిపంటలు సకలసౌభాగ్యములును;
అమితగురు దేవభక్తి పూర్ణానురక్తి
యమరి యచటిచాతుర్వర్ణ్య మబ్బురముగ
స్వస్వధర్మాభిరతిచేఁ బ్రశస్తి గాంచె.

ఋషభపుత్రుఁడు భరతుఁ డన్ నృపతిమౌళి
పాలన మొనర్చుచుండె నాపట్టణమును
సొగపు పుట్టించి చుట్టాలసురభియైన
పంచజని యనుసద్ధర్మపత్నిఁ గూడి.

దర్శపూర్ణిమ లాదివేదప్రసిద్ధ
సన్మఖంబుల నెన్నేని సలిపి, వాని
ఫలము సర్వము నీశ్వరార్పణ మొనర్చి
భోగియై రాజయోగియై పాలిచె నతఁడు.

భావనాతీతదివ్యప్రభావుఁ డతఁడు
సేవకోత్పలమండలశీతకరుఁడు
వైదికాచారనిరతుఁ డవార్యశౌర్యుఁ
డతని గొనియాడ వాగ్జాని కైనఁ దరమె?

ఇట్లు సకలజనానంద మెసక మెసఁగఁ
జిరము రాజ్యము పాలించి భరతరాజు
ముదిమి గదురుట తలపోసి పుత్రకులను
ఆప్తమంత్రుల రావించి యనియె నిటులు.

"సార మని యీయసారసంసార మొంది
యనుభవించితి నిందాఁక యమితసుఖము
లింకె జవసత్త్వములు కోర్కె లివురఁబాఱె
ఈజరావ్యాఘ్రి తలఁ దాండవించుచుండె.

ఐహికమ్మున కింతయో యంతయో గ
డించికొన్నాఁడ నొకకొంత సంచితమ్ము
పరమునకు సుంత జాగ్రత్తపడక వట్టి
బేల నైతిని జెల్లెను గాలమెల్ల.

కాన నాముందుగతికయి కాన. చేరి
కొంచెమో గొప్ప యత్నము కొనఁగవలయు"
అనుచుఁ దనయాప్తమంత్రిసమక్షమునను
బంచి సుతులకు నిచ్చె సంపదలనెల్ల.

అవల నాఁతడు పరమేశు నాత్మ నిలిపి
విపినముల మునివృత్తి కావింపఁ దలఁచి
యతులభోగంబులను వీడి సుతుల వీడి
చేరెఁ బులహాశ్రమమును నిశ్చింతముగను.

దైవరూపసాలగ్రామతతి ఫలించు
జీవనది; పుట్టు వనెడికస్తిని దొలంచు
పూతవాహిని; లోకైకపూజ్య మైన
గండకీనది ప్రవహించుచుండు నచట.

నిత్యకృత్యము లందుఁ దా నెఱపికొనుచు
వివిధనవపుష్పపల్లవవితతి గూర్చి
విగతవిషయాభిలాషుఁడై విష్ణుపూజ
భక్తియుక్తులఁ జేయుచు భరతుఁ డుండె.

విడఁడు శ్రీహరిచరణారవిందసేవ
విడఁడు నిత్యానుసంధానవిమలయోగ
ముడుగఁ డతిరక్తిఁ బూజామహోత్సవముల
నుడుగఁ డచ్యుతభావన లొక్కవేళ.

అతనినైష్ఠికవృత్తి యోగానురక్తి
యవిచలితచిత్తసంధాన మచటిమునులు
కాంచి యుబ్బరవోవుచుఁ గలిసి యిట్లు
గుసగుసలువోయి రనురక్తి గుప్పళింప.

"ఈతఁడేనా! స్వనామచిహ్నితవసుంధ
రామహామండలుం డగురాజమౌళి?
ఈతఁడేనా! తృణీకృతాహీనరాజ్య
భాగ్యవైభవుఁ డైనయాభరతరాజు?

ఈతఁడేనా! సమస్తదిగీశబృంద
నిరతతోష్టూయమానసన్నిద్రకీర్తి?
ఈతఁడేనా! ప్రసిద్ధమునీశ్వరాను
పాలితవిశిష్టయోగుఁ డాభరతరాజు?

సకలజీవప్రియంకరసాధుచింత
నావిశుద్ధాత్ముఁ డీతఁడేనా భరతుఁడు?
బ్రహ్మతేజస్సముజ్జ్వలభసితదివ్య
దేహదేదీప్యమానుఁ డాధీరుఁ డితఁడ?

వేదవేద్యచాతుర్వర్ణ్యవిహితధర్మ
పాలనాదక్షుఁ డైనయాభరతుఁ డితఁడ?
పరమవేదాంతసుజ్ఞానభాస్కరప్ర
మోషితాబోధతిమిరుఁ డాముని యితండ?"

అనుచు మును లెన్న నాతఁ డష్టాంగయుక్తి
నంజగొని యింద్రియముల సర్వార్థసాక్షి
యైనచిద్రూపుఁ దలఁచుచు ననవరతము
పరమయోగానుసంధానపరత నుండె.

అట్టు లుండఁగ నొక్కమధ్యాహ్నవేళ
గండకిఁ గృతాభిషేకుఁడై, కర్మసాక్షి
కెఱిఁగి గాయత్రి జపియించుతరుణమందుఁ
గలిగె నగ్గడ నొకదైవవిలసనమ్ము.

గగన మాగడపలువెట్టి కాఱు గ్రమ్మె
తరుల నల్లటపెట్టువాతమ్ము రేఁగె
ఆపలేనియక్కిలిపాటు నందువాని
కరణి గండకి యూర్ములఁ గళవళించె.

ఆసహస్రకరోన్మేష మట్లు మెఱయు
చుండె మెఱపులు, కావిరి నిండె దెసల
అదుబిదుకు సెంది మెకములకదుపులెల్ల
మిగుల నలుగుల మందెఁ బెం పగలి పొగుల.

జీర్ణతృణపర్ణజాలము చెదరిపడుచు
భూరజఃపటలమ్ముతోఁ బొందు సలిపి
పొగ లెగయురీతి నెగసి యబ్బురము గదురఁ
జేసెఁ గరువలితాఁకునఁ జిత్రగతుల.

ద్రుమములెల్ల ఝుంఝూవాతధూతము లయి
వాఁతు లగలఁగ నూఁగాడిపడఁ దొడంగె
గహనసంకులఖగకులకలకలము న
భమ్ము తూఁటులు వెట్టె భీభత్సముగను.

అపుడు నిర్భరగర్భభరాంగి, భీతి
చకితదృగపాంగ, విపినసంచారఖిన్న
యడుగు తీసి యడ్గిడలేనిహరిణి యొకటి
డప్పి యణఁచ నచటిగండకిని దఱిసె.

తఱిసి నీ రానుచుండ నదాటుగా మ
హాభయంకరముగ క్షోణి యదరునట్లు
పెటపెటపెటార్భటులతో గుభిల్లుగుభిలు
మనుచు నుఱిమెను బ్రహ్మాండ మగలి తునియ.

స్థగితరోదసీకందరశ్రవణభైర
వముగ నుఱుముడు హరిణి స్వభావభీత
యగుటఁ గడు బెగ్గడిల్లి దిగ్గన నుదరుము
గగన మంటఁగ బిట్టు లంఘన మొనర్చె.

అధికభయలంఘనమున నాహరిణినిండు
గర్భ మప్పుడు గళితమై గండకీన
దీప్రవాహమునం బడి తేలుచుండె,
హరిణి యద్దాన నెదవడి తొరఁగె నసువు.

ఈవిచిత్రసంఘటన మీక్షించి యతఁడు
దైవసిర్ణయ మిది యని తలఁచి వగచి
జపము చాలించి హృదయము సంచలింపఁ
జొచ్చి వెల్లువఁ బ్రారబ్ధచోదితుఁ డయి,

అంబువులఁ దేలుహరిణపోతంబుఁ గాంచి
యెడఁద నక్కస మందుచుఁ గడఁగి దాని
నుద్ధరించి యాశ్రమమున నుంచి పెంచె
బాపురే! యెచ్చటిఋణానుబంధమొ కద?

ఆతఁ డతృణాద మైనయాహరిణశిశువు
తల్లికుడుపు నాశించుచుఁ దడవులాడ
జాలి యాఁగుబ్బుకొనఁ దల్లిచావుపిల్ల
కటకటా! యని లోలోనఁ గలఁతపడును.

పాలకై కూన విడిచి పోవంగ లేక
యెలమి బుజముల దాని నెక్కించుకొనుచుఁ
బల్లెలెల్లను దెగఁద్రిప్పి పరితపించు
దానికుయి యక్కఁగో జ్ఞాయి తన్ను వేఁప.

తల్లి మరణించినట్టియార్ద్రప్రసూతి
వా యెఱుఁగనికూన, యాప్తతను నాదు
సన్నిధిఁ జరించుచున్నది చనవు మిగుల
ననుచు భరతుఁడు దాని మన్ననల సాఁకు.

ఫలసమిత్కుశకుసుమసంపాదనముల
స్నానపానభోజనములు సలుపునెడల
దేవపూజాజపాదులు దీర్చునపుడు
హరిణసంగతి వీడఁ డాభరతరాజు.

పూరి మేయ నాల్గడుగులు పోయెనేని
క్రూరమృగము లంకిలిపెట్టి కూల్చునేమొ
యనుచు నద్దాని వెనువెంట నంటి తిరుగుఁ
బ్రణయభరితాంతరంగుఁడై భరతరాజు.

తనకుటీరప్రాంగణములందుఁ దాను దిరుగు
చుండ ననుగతభృత్యుని యొప్పు తోఁప
వెంటఁ దిరుగాడు మృగశిశువిధము గాంచి
పరమసంతుష్టి నందు నాభరతరాజు.

కొంతసేపు బుజంబులఁ గొని వహించుఁ
గొంతతడ వక్కునం జేర్చికొని చరించుఁ
గొంతవడి కంకశయ్యలఁ గూర్చికొనును
ఉరుతరస్నేహమునఁ జేసి భరతరాజు.

ఒడిసి జేరిచి యొక్కొకప్పుడు నిమురుచు
మనుచు నాశీఃపరంపరలను గరమ్ము
పచ్చికను నోటఁ బెట్టి చుంబన మొనర్చు
హరిణమందలిమోహాన భరతరాజు.

నిత్యనైమిత్తికాదులు నెఱపునపుడు
ధ్యానధారణములు సల్పుతరుణమందు
సైత మొకపరి లేచి కాంచక మనస్సు
నిరవుకొల్పఁగ నేరఁ డాభరతరాజు.

పాలు త్రేఁబోయి కొంతసేపటికిఁ జేరు
గటికకై యేఁగి మఱికొంతకాల మ్ముందు
చామలకు వెళ్లి యటఁ గొంత జాగుసేయు
హరిణమే లోక మనుకొని భరతరాజు.

హరిణ మొకత్రుటిలోఁ గను మొఱఁగెనేని
కొడుకు పోయిన ట్లడలడిఁ గుమిలి కుమిలి
కాలు గాలినపిల్లి యై కాననమునఁ
బరితపించుచుఁ దిరుగు నాభరతరాజు.

"హరిణపోతంబ! నీకు వనాంతరమునఁ
గ్రూరమృగబాధ లేకుండఁ గోరుచుండఁ
దలఁగి పోయితె యనుచుఁ జిత్తంబునందు
రాజవృషభుఁడు భరతుఁ డారాట మందు.

తల్లి కెడసినహరిణపోతంబు వచ్చి
పుణ్యహీనుండ నగునన్ను బొందె పాసె
నేమి చేయుదు నే నింక నెట్లు కనుదు?
చేరి యేవిధిఁ గాంచి రక్షించికొనుదు?

అక్కటా! యే సమాధి నున్నపుడు కదిసి
కొమ్ముకొన నాదువీపును గోకి గోకి
మసలి మూఁగను వెట్టి రోమంథ మభ్య
సించునా యేణికూన దర్శింతు నెట్లు?

కొండపొలముల మేయుటకొఱకు వెడలి
కలయఁ బండిన తెల్లుఁబూవులకు నడుమ
నిలిచి యులపాంకురములకై నెమకునాదు
లేడిసొగసుందనం బేడఁ జూడ నగునో?

పూలుఁ బండ్లుఁ బూజాద్రవ్యములను ద్రొక్క
మూర్ఖుఁడు, నేను స్రువమెత్తి మోఁదనెంచఁ
గొట్టుటకె యెత్తినా రనుకొనక స్రువముఁ
గూడ మూఁచూచునా లేడిజాడ యేడ?

కట్ట! యీయాశ్రమంబునఁ బుట్టినట్టి
బాలతృణముల మేసి సంబరముతోడ
నాకమండలూదకము పాన మ్మొనర్చి
గంతు లిడులేటికూన నేకడను గనెదు?

పుత్రకునిభంగి నొడిఁ జేరి ముద్దు లిచ్చి
యిట్టటు చరించుచును జౌకళించుచుండి
పండుచును బారలుచుఁ జిన్ని పరువు లిడుచు
మురిపెముం గూర్చులేడి నేకరణిఁ గనెదు ?

కొమ్ములను బల్మి నేలను జిమ్మికొనుచుఁ
గాలుద్రవ్వుచు నాయాగకములఁ దనదు
గిట్టలను బిట్టు మట్టుచుఁ గెరలుచుండు
హారిణ మేకడ నున్నదో" యనుచుఁ బొగులు.

ఏమృగేంద్రము కొట్టి బాధించెనో ? మ
తేవృకంబులు చంపి భక్షించెనోటు !
మృగమ ! నేనీప్రతీక్షణయుగము లెట్లు
నిన్ను గానక యాపింపనేర్తు నను.

దానిచక్కందనంబు చిత్తమునఁ దలఁచి
యెల్లయిక్కలు నెమకి తా నెలుఁగు లిచ్చి
యెచటఁ గానక యుమ్మలించుచుఁ గరమ్ము
సరగ నెట్టకునేని యాశ్రమము చేరు.

చేరి కూర్చుండి తన్నుఁ దా దూఱుకొనుచు
నచట నెండుటాకులు చప్పుడైనయంత
లేడియే యని దిగ్గన లేచి వట్టి
బయలు గాంచుచు నుండు నాభరతరాజు.

హరిణపోతంబుమీఁదిమోహమున నిట్లు
పనవి యగ్గలపుంబ్రీతి భరతరాజు
అడవి నేడనో యెదురుతాఁకగుడు మురిసి
నిధిని గనుపేదవోలె దానిని గ్రహించు.

నిరతహరిసంస్మరణ మూను భరతరాజు
నిరతహరిణస్మరణమున నెగడుచుండె.
హరిసపర్యల నొనరించుభరతరాజు
హరిణసేవల నిరతము ముఱియుచుండె.

హరిణమూలకముగ నంతరాయము గల్గి
భ్రష్టయోగుఁ డయ్యె భరతుఁ డపుడు.
పరమమునులనైనఁ బాయదు ప్రారబ్ధ
కర్మ మనుభవమునఁ గాని తలఁప.

భరతుఁ డట్టులు హరిణసంపర్కమునను
సర్వము త్యజించి దినములు జరుపు చుండ
మరణ మనునది దేహధర్మంబు గాన
కాల మాసన్న మగుచుఁ జీకాకు పఱచె.

అప్పు డతఁడు లేడి కాసన్నవర్తియై
నీరు నింపికొన్న నేత్రపాళి
నాపరాని మోహ మాయాస మీఁడ్రింప
వడఁకుపడినుడుల వనరె నిట్లు.

"అకట ! సుతనిర్విశేషసౌహార్దమునను
నిన్ను గొనివచ్చి పెంచికొంటిని గదమ్మ !
హరిణపోతమ ! నిను విడనాడి నేఁడు
ఒంటరిగ నెట్లు పోనేర్తునో యెఱుంగ ?

రాజ్యసుఖముల సుతుల నిరాకరించి
గహనమున నుండ నిదు సాంగత్య మబ్బె
కటకటా ! యొక్కయసువయి గడపు చుండ
మనల విడఁదీయుకువిధి నే మనఁగ నేర్తు ?

నీవిలాసముల్ చేష్టలు నీగుణములు
మఱచిపోవుద మన్నను మఱపు రావు
స్వర్గమం దైన నేను నీసంగతిని దొ
డంగి యెట్లింక సుఖినై మెలంగ నేర్తు ?

నాబహిఃప్రాణమా ! హరిణమ ! యఖండ
పుణ్యఫలమ ! మదంకవిస్ఫురితపికమ !
నాకు నీకు ఋణానుబంధంబు సెల్లె
మెలఁకువను రేపకడ నుండి మెలఁగుమమ్మ !

ఆటపాటల స్వేచ్ఛావిహారములను
ఎన్నడైనను నన్ను స్మరింపుమమ్మ !
నన్ను మఱువకుమమ్మ ; నాకన్న వారి
కన్న మిన్నగ నిన్నోమికొన్నవాఁడ.

కంట వత్తిడుకొనుచు నక్కటిక మూని
మివుల దెసపడి సాఁకి తీమీఁద దీని
బ్రదిమి యేమానొ ? యాలనపాలనమ్ము
లెవ రొనర్తురొ దీనికి నితవరులయి ?"

అనుచు హరిణప్రసక్తప్రేమానుబంధ
బంధితాంతఃకరణుఁడయి భరతరాజు
దానిఁ గాంచుచు మనసెల్ల దానియందె
నిలిపి తద్భావుఁడై యుసురులను విడిచె.

దేహము త్యజించునప్పు డంతిమపుదశను
హరిణగతచిత్తవృత్తియై యాతఁ డుంటఁ
బూర్వసంస్మృతి హరిణమై పుట్టె నట్టె.
తెలియ "యాం తే మతిస్సా గతి" యన వినమె.

అస్తమించినభరతుతో ననుగమించు
వానివలె నుండె నంత గభస్తిమాలి
ఉదయ మస్తమయం బెట్టియున్నతులకు
నేని దాఁటరా దనుచు బోధించుకరణి.

పడమరను జేరుసూర్యబింబమ్ము, స్వీయ
ప్రతిఫలనరూపబింబసంపదలతతిని
చలదభంగతరంగకాసారములకు
నవ్యసౌవర్ణసేతుబంధన మొనర్చె.

అస్తమించుచు నున్న సూర్యాంశువులను
నొక్కటొక్కటిగ లెక్కించుచున్న రీతి
తనదు రేకులు ముడుచునా తమ్మిముగ్ధ
మధురతరశోభ వర్ణింప మనసుపడెద.

రమ్యవృక్షాగ్రముల మయూరములు తమిని
మూతు లెడచేసి యాదినాంతాతపమును
గ్రోలుచున్నవి వోలెఁ జిక్కుల విదిర్చి
చిత్రసౌవర్ణపింఛాలఁ జెలఁగి యాడు.

వత్సలత హోమధేను లంభారవమ్ము
లెత్తుచును గ్రేపులండల కేఁగి పిలిచె
పెంపుడుమృగమ్ము లెల్ల నిర్భీకవృత్తిఁ
జెలఁగి యుటజాంగణమ్ములఁ జేరుకొనియె.

హుతవహునియందుఁ దన తేజ ముంచి యస్త
మింప నున్న భాస్కరుఁ బరమర్షులెల్ల
సామగానఋక్కులను హస్తములు మోడ్చి
నతులు నుతులును సలుపుచున్నారు భక్తి.

పాదముల భూతలము నంటి పరమమునులు
శ్రద్ధతోఁ బవిత్రాంబువుల్ చక్కఁ బట్టి
యర్ఘ్యము నొసంగి సూర్యుని కభిముఖు లయి
త్రిపద గాయత్రి జపియింపఁ దివురు చుండ్రి.

అస్తశిఖరికిఁ బోవునర్యముని వెంట
ననుగమించుచు నుండె సంధ్యాంగనయును
ఉదయమునఁ బురస్కృత యైనయువిద యిపుడు
కూడి వెనుకొన మదిని సంకోచపడునె ?

ఇరుఁగెలంకులఁ జీకటు లెలయఁ, బుడమిఁ
జిక్కువడినదివోలె రంజిలెడిసంధ్య;
పార్శ్వముల రెండిటఁ దమాలపంక్తులు గల
ధాతుసద్రివ నదివలెఁ దనరుచుండె.

అంధతమసము దిక్కుల నలముకొనుచు
సర్వజనదృక్ప్రసారము జాడ్యపఱుప
గర్భవాసశిక్షను బొందుకరణి సకల
భువనముల్ ప్రమిలితములై పొగులుచుండె.

జగదగాధపాథోధి కజ్జల వినీల
తిమిరనీరపరీతమై దిక్కులంట
పొరిఁ దదభ్యంతరమున సంచరదహీన
సత్వములరీతిగా ప్రాణిసంఘ మొప్పె.

మహిఁ జలాచలనిర్మలమలినములును
సరళనిమ్నోన్నతప్రదేశములునెల్ల
అంధకారోపరుద్ధసర్వాంగము లయి
యేకరీతిగనే గోచరించుచుండె.

మంచిచెడ్డ లేకమ్ము గావించుచుండి
సర్వ మొకటిగఁ జేసెడిసంకరుల ప్ర
భుత్వ మొకకొంతకాలము పొలుపు గనిన
నంధకారవృత్తిని గర్హ్య మౌనుగాదె.

చిమ్మచీకట్లుఁ గదిసి విచిత్రలీల
తివురు జగదహి చంద్రకాంతి యనుమిషను
కుబుసమును జార్చుచున్నట్లు గోచరించు
మేనిపొడలట్లు నీడలు మిగిలి వెలుఁగ.

అట్లు హరిణమై పుట్టి పూర్వార్జిత మగు
భవ్యయోగానుబంధసంబంధగరిమఁ
దనకుఁ గలిగినమృగజన్మమును గ్రహించి
భరతుఁ డెదలోన నిట్లు తాపంబు నెందె.

"అడ్డగొడ్డము లేక నాయాజ్ఞ చెల్ల
రాజులు నుతింప రాజాధిరాజ నైతి;
సుతులఁ బడసియు వారి రాజులనొనర్చి
వైదికాచారపరుఁడ నై వఱలి యుంటి.

సత్యము నెఱింగి శ్రీహరిస్మరణమనన
కీర్తనారాధనాదిసత్క్రియ లొనర్చి
హరిణసంసక్తచిత్తత నంత్యదశను
మోక్షదూరుండ నగుచు విమోహి నైతి.

తాపసులు మెచ్చ సకలసంతాపములకు
నాకరం బగుసంసృతి నవలఁ దఱిమి
సంగహీనుండ నై తపశ్చర్యనుండఁ
బాపహరిణము నా కేల దాఁపురించె.

దాఁపురించెను బో ! దానిఁ దరిసి యేల
ఉద్ధరించి పెంచితి విమోహయుండ నగుచు?
దైవ మెంతటియఱగొడ్డుతనము నూని
పాలివాఁడయి నన్నధఃపతితుఁ జేసె.

ఏటఁ గలిసెనె నాబోధమెల్లఁ దొలఁగి ?
రిత్తవోయెనె పరమగరిష్ఠ నిష్ఠ ?
సమసెనే నాదుయోగవైశద్యవిద్య ?
యింత భ్రష్టు నొనర్చునే యేణ మిటులు ?

యోగయుక్తిఁ దరింపఁగ నూహ సలిపి
తుద కణంగితి బ్రాహ్మణకదళివోలె.
కోరికలు దివ్యసుఖములఁ గోసరుచుండ
దాస్యవృత్తి కదృష్టంబు దారి తీసె."

అని నిగూఢనిర్వేదుఁడై యాశ్రమమున
శుష్కతృణపర్ణభుక్తి విశోష మంది
సంగమును రోసి దేహావసానదశను
గోరుచును గంటఁ దడివెట్టి కుతిలపడుచు.

ప్రణవమంత్రము జపియించు బ్రహ్మమునుల
వేదఋక్కుల వల్లించు విప్రవరుల
తివిరి త్రేతాగ్నులను వేల్చుదివ్యమునులఁ
జేరి నిల్చి తదేకదృష్టిని దపించు.

మాధుకరవృత్తిఁ దిరిగెడిమాణవకుల
ఫలములం దెచ్చువృద్ధతాపసిగణములఁ
గుసుమములఁ గోయుమునిబాలకులను వెంబ
డించి యెడగిల్లి తిరుగు నామృగము సతము.

కరుణ నెవరేసి గుప్పెడుకసవు నిడఁ
గోచవాఱుచు మిగుల సంకోచపడుచు
నందుకొని తినుఁగాని తనంతఁ దాను
కోరి కడిగొన కేపటి క్రుయ్యఁబాఱె.

ఘాతుకమ్మృగమ్ము లెసరేఁగి కవియఁబోవ
నాత్మరక్షణ మెటు లని యరయఁబోదు
దళకొనినదప్పి గండకీతటినిఁ జేరి
యశ్రుధారలఁ దర్పణ మాచరించు.

ఇట్లు తనదురవస్థ కెంతేని క్రుళ్ళ
గించు చాలేడి చివర కిట్ట్రింకు లింకి
కూడు నీ రాన కానదీకూలమందె
కూలి తనమృగత్వము పాచికొనియె నంత.



# జడభరతుండు

## ద్వితీయ బింబము

ఎన్నియో జన్మముల నెత్తి యెంతయెంత
కాలమో నెట్టి యెన్నెన్ని కష్టదశల
నిస్తరించినఁగాని మానితమనుష్య
జన్మము లభింపఁబో దెట్టిజంతువునకు.

తుచ్ఛమైవిషయికేచ్ఛలఁ దోలఁగఁబెట్టి
కొనుచు నాధ్యాత్మికానంద మనుభవింప
అమలప్రణవమంత్రోచ్చారణాధికార
మందఁగాఁ బాత్ర మీ మనుష్యత్వమెగద!

పంజరాబద్ధమైయున్న పతగమునకు
బంధమోక్షమ్మె మానవత్వమ్మనంగ,
దుర్గమారణ్యముల దాటి తుదకు రాచ
బాట చేరుటే మానవత్వమ్మనంగ.

పూర్ణముగ సర్వబంధవిముక్తుఁ డగుచు
నట్టి యపరిమేయానంద మందఁ గలుగ
భరతరాజిప్పు డెంతయుఁ బాత్రుఁ డయ్యె
పరిణతం బయ్యె నాతనిభావ మెల్ల.

తనదునున్నుఁటలూఁగు విస్తరతరంగ
మాలికల మున్కవెట్టుసమస్తజనుల
కిల్బిషము లోత్తరించుచుఁ గెరలునట్టి
యిక్షుమతి యనునొకనది యొసఁగుచుండె.

తత్ప్రశాంతకూలమున శీతలత నెఱపు
పూవుఁదోఁటలు నారామములును వెలయు
అట తదంతికముననె శివాలయ మను
గ్రామము విరాజిలున్ బుణ్యధామ మగుచు.

ద్వేషభావులు మాత్సర్యదిగ్ధహృదయు
లల్పమతు లకించనులు స్వార్థైకపరులు
కంచుకాగడా వెలిగించి కలయ వెదుక
కనఁగరారు తత్పురిని మందునకు నైన.

జాతిమతభేద ముడిగి, విశాలదృష్టి
నైకమత్యము గలిగి మర్యాద లెఱిఁగి,
పాడి విడక న్యూనాధికభావ మడఁచి,
సంచరించెద రాగ్రామజనులు సతము.

ఒక్కచో నుండ నొల్లక యొకని వీడి
మఱియొకని నాశ్రయించు రమాలలామ
స్వీయచాంచల్యగుణము వర్జించి, కాలు
జాఱి యాపురమందునఁ జదుకుపడియె.

ఆశివాలయపురవర మధివసించి
యగ్రహారంబునకు నగ్రహార మగుచు
ఇంద్రచూడుఁడు నా బాపఁ డెదురులేక
పూజ్యత గడించి మించి కాపురము సలుపు.

తగినయిలువడి దానికిఁ దగినయీవి
దాని కినుమిక్కిలిగను సద్వ్యయనగరిమ
దాని మించినసిరిసంపదలు లోలంక
యెట్టికఱగొఱ లేక వర్తించు నతఁడు.

అతని కార్యయుఁ గమలాంబ యనెడిధర్మ
పత్ను లిర్వు రుండిరి; జ్యేష్ఠభార్య యార్య
అష్టపుత్రులఁ గనె; కమలాంబయందు
నొక్కకొమరుఁడుఁ గొమరిత యుద్భవిలిరి.

భ్రష్టయోగుఁడు మునుపటిభరత రాజె
యిపుడు కమలాంబగర్భమం దిరవుకొనుచు
విధివిధానముకతన నావిర్భవించి
భరతుఁ డనుపేరె యీజనిఁ బడయఁగలిగె.

అతఁడు జ్ఞానముతోడిబ్రహ్మానుభూతి
భోగవాంఛావిహీనసత్పుణ్యదృష్టి
పూర్వజన్మసంస్మృతియును బొంది నేఁడు
పదిలుఁ డౌచుఁ జిదానందభరితుఁ డయ్యె.

దుర్లభజ్ఞానసంపద తొలుత గాంచి
మోహమున మున్గి దానిఁ గోల్పోయి యుంట
నేఁటినిజ మైన సఫల మై నెగడుకొఱకు
భరతుఁ డాశించు మిగుల నిబ్బరముతోడ.

ఆతఁడు తదర్థమై లోకమందుఁ గలుగు
సకలసంబంధబంధముల్ సడలుకొలిపి
ఆకు నంటక యెప్పాటఁ బోక నైనఁ
బొందక చరించు నాత్మవిస్ఫురణ మిగిలి.

"యోగి ప్రచ్ఛన్నవృత్తిమై నుండకున్నఁ
బరమతత్త్వైకచింత కుపాధి పుట్టు
ననుచు జడవేషమును గ్రామ్యమైనభాష
లధికమాలిన్యతనువు నై యాతఁ డుండె"

తోడివారలతో నాట లాడఁ బోఁడు
పలుకరించిన వెఱ్ఱిచూపులను బఱపు
కేకిసలుగొట్టుచున్నను కెల్లుమలఁగు
గడ్డుకొనుసిగ్గరివిధానఁ గలియఁ డొరుల.

పరిచయంబున్న లేకున్న నొరులవెంటఁ
బోవు, నొక్కప్డు గొణఁగుకోఁబోవుచుండు
వార లెగ్గించుచున్న నువ్వాయిగొనును
స్థాణువై నిల్చు నొకపరి చదికిలఁబడు.

ఇతరసుతు లెందఱేఁ గల్గ నీతనియందె
యింద్రచూడుని మానస మెలమిఁ దగిలె.
పూవు లెన్నున్న నామనిమావిపూఁత
యందె యళిమాల మిక్కిలి యన్నుకొనదె ?

నాఁడు నాఁటికిఁ బుత్రసంతతికి వేద
విధులు జరిపించి శ్రద్ధతో విద్యలెల్ల
నింద్రచూడుఁడె బోధింప నెంచెఁ గాని
భరతు వైఖరి పెడదారి పట్టెఁ దొడఁగె.

ఆతఁ డుపదేశకాలమునందు జనకుఁ
డెంతగా పేరుగ్రుచ్చి బోధించుచున్న
భయము భక్తియు నెఱుఁగనివానిపగిది
పెదవి కదలింపకయె చూచు వేలచూపు.

ఎగ్గంతంబునఁ జేరిచి యెన్ని యెన్ని
మెలఁకువలొ దెల్పి యొంటరమింటరములఁ
గోరవారుచూడ్కుల నెంత కోపపడిన
నకట ! యుసిపోయె నాతనియత్న మెల్ల.

ఇట్లు వెరవునఁ దనతండ్రి యోఁపరింపఁ
గలుచకన్నుల బాష్పముల్ గలుగఁబోవు
మోముఁదామర యిసుమంత ముడుగలేదు
భరతుహృదయము కిసమస పడదు సుంత.

విసివి చివరకుఁ దండ్రి సావిత్రి నైన
నోటఁ బలికింపవలె నని నూటి పోసెఁ
గాని యానోటఁ బలుకు బంగార మాటఁ
గాల మెంతయొ వృధ యయి గడచిపోయె.

"ఆకృతి సమస్తగుణముల కాకరంబ
టన్ననుడి భరతునియందు సున్న యయ్యె
దుండుబలి పీఁడు వట్టియొంటొడుసు లేల?
యనుచుఁ గఱకులు వల్కెడు నన్న యొకఁడు.

అవదగాకి యింతఁ డాతనితో రేయిఁ
బవలు లిట్లు బాధ పడఁగ నేల?
కసిఁడికోఁతవెట్టఁ గడకు గయ్యాళించు
ననుచు వే ఱొకన్న యాడిపోయె.

పలుకఁ జాలను గాని యీభరతురూపు
కనుఁగొనినయంత హృదయము గాతుకలఁగి
గండరించును వాత్సల్యగరిమ మేమొ ?
యనుచు జాలిని పచరించు నన్న యొకఁడు.

దొసఁగులం బెట్టఁ బలుకాడఁదొడఁగ డకట!
నయభయంబుల బోధించినం గ్రహింపఁ
డచ్చలించిన నా కేకరాక్షుఁ డగును
వీఁడు వేతిఁడి గాక వివేకి యగునె ?”

అనుచుఁ దల కొకరీతిగా నన్నలెల్ల
నేతుసూపుచుఁ బలుకఁగా నింద్రచూడుఁ
డమితబాధను జెంది దిగ్గాబు చుండె
నాఁడునాఁటికి; మోహ మెంతకును దేదు ?

మేఱిమీఱుచుఁ జబ్బనచూఱలాడ
నెన్నిసంపద లున్నను నేమి ఫలము ?
కోటివేనుంగులబలంబు కొసకుఁ దెచ్చు
నట్టియానందము హుళక్కి యైనయెడల;

అంత కంతకు సుతిమించి యాభరతుఁడు
ఊరజోగియై బూడిద నొరఁగి తిరుగు
పట్టి బలవంతపెట్టినఁ బట్టెఁ డన్న
మెప్పుడో భుజించు మనసున కిష్ట మైన.

ఆతఁ డొక్కకతూరి నగ్నాటుఁ డగుచు
నుండు వట్టకనడు రేల నూహ తొలఁగి;
నాది నావా రనెడిబుద్ధి నాఁడె తీఱె
నెవ్వఁ డెఱుఁగు లోకోత్తరహృదయగతుల ?

ఎవ్వఁ డేపనిలోఁ బ్రవర్తింపఁ జేయు
సొంత మగువఱ కద్దాని నాచరించు
మోము పెడద్రిప్పి పొమ్మన్న ముక్కుసూటి
గా నడుంకుచుఁ బోవు బికారి వలెనె.

ఇట్టిచెయ్వులు గుంజిలిపెట్ట లేక
మిపుల చూకురుపడి తండ్రి తెవులుకొనుచు
ఆశ లడుగంటఁ దనచెలం తంతరింప
భరతుఁ గూర్చి పనవుచుఁ బాసెఁ దనువు.

పతిని సహగమింప భామాకులానర్ఘ
రత్న మైనకమల యత్న మూని
కూఁతు వెట్టికొడుకుఁ గూడ సపత్నికి
నప్పగించి పిదప యనియె నిటులు.

ఆడుబిడ్డ యీమె యత్తిల్లు చేరును
దీనిభార మంత గానుపింప
దిపుడు కొడుకుఁ గూర్చియే చెప్పఁదలఁచితి
చివరియొప్పగింత చెవిని బెట్టు.

"అక్క యీబిడ్డ నీబిడ్డ యనుచు నెంచి
పెంచి పెద్దగఁ జేసి మెప్పించికొనుము
వీనిఁ గాంచుచు నాదుజీవితమునందు
దాఁపురిలు కష్టముల నెన్నొ దాఁటియుంటి.

ఇతనిచేవాటు నాకు సర్వేంద్రియప్ర
తర్పణమె గాక దుఃఖసంతరణహేతు
వతులితానంద కారణ మగుచు నుండుఁ
గారణం బేమొ దీనికిఁ గానఁబోను.

ఏనికడుపాఁకలి గని నీవే రవంత
యన్న మిడవలెఁగాని వాఁడై యడుగఁడ;
ఏనిసర్వే కారాకృతిలోన నేదొ
యర్థమే గానిపరమార్థ మమరి యుండె"

అనుచు బిడ్డ లిర్వురను నామె కర్పించి
పుణ్యహృదయ యగుచుఁ బూర్వసతుల
సచ్చరిత్ర లెన్ని సాహసధైర్యముల్
జంట నడుపఁ బతిని సహగమించె.

కమల పతిచితాగ్నిఁ బడి దగ్ధమ్మౌ గాఁగ
దాఁటువడ్డబంధుగులరోదనము దెసల
నెదురుసెలఁగఁగ భరతుఁ డామెడనె నిర్వి
కారుఁడై జెప్ప వాల్పక కాంచుచుండె.

"ఎట్టికట్టుపకాసియో యాతఁ డిట్లు
ప్రబలగంభీరతరమనోబలముతోఁప
సిలిచెఁ జెక్కు చెమర్పక; నిజజనకుల
మృతియుఁ గలఁపఁగలే దయ్యె సితనిహృదిని.

వారిరక్తధార వర్షిల్లినాఁడంట
వారియాత్మ తనదువైఖరి యంట
తల్లిదండ్రు లీల్గఁ దాఁ గారణం బంట
కుమిలి యేడ్వఁ డేలొకో యితండు ?

తట్టి మానస మూఁదరవెట్టునట్టి
పితృమృతిని మించునొత్తార వితర మున్నె ?
కట్ట ! దానికై వగవఁ డీగజ్జులాఁడు
బళిరె ! గుండెలు తీసినబంటు వీఁడు.

కావలె నటన్న వత్తురే ? కాఁటఁ గలసి
నట్టిపితరులు వీఁ డేల నిట్టదొట్టు
శోకమునఁ గూలఁబడఁడు నిర్భీకునిగతి
ఆయియో వీసియెడఁద వజ్రమున కెనయొ ?"

అనుచుఁ జూపఱు భరతు నోనాడిపోయ
పండితంమన్యులై నట్టిభ్రాత లెల్ల
భరతునవివేకదృష్టికి బాధపడిరి.
జ్ఞానితత్త్వము తెలియునే జడమతులకు ?

జననమరణముల్ మాయసంసారమందు
బండిచక్రపుటాకులపగిదిఁ దిరుగు
లోకమే చావుబ్రతుకులలో వసింప
వాసి నిస్తరించుటకు నెవ్వరికిఁ దరము ?

జంతుకోటికి శిక్ష లనంతము లయి
కారణేతరసంబంధకలనఁ గలుగు
నందుఁ గొన్నిటి నేసాధనాంతరముల
నైనఁ దప్పించుకోఁ జాను మానవులకు.

పుట్టువుండొట్టి తెచ్చికొన్నట్టి దాచు
దేహము శరీర మనునామధేయములను
మనల విడనాడకున్నట్టిమరణ మెట్టి
వానికిఁ దరింపరాని దేవలన నైన.

కన్నపెంచినవారు స్వర్గతులు గాఁగ
భరతుఁ డనుజులపెనుపునఁ బెఱుఁగుచుండె
అగ్రజుం డందు ముక్తికామావ్యాయుండు
కన్నులను గప్పి యాతనిఁ గాంచుచుండు.

ఉగ్గడువు గొన్న పెరిమతో నున్నబంధు
వర్గ మఱచేత నిడికొని భరతు నెపుడు
ప్రాణపంచక మట్లు గాపాడుచున్న
నేమొ యతఁడు కామంగామి యై మెలంగు.

కాని శ్రీకంతుఁ డనెడియగ్రజుఁడు భరతు
వైఖరిం గాంచి చిందిలిపాటు గొనుచు
దండతాడనవిధుల నాతని నెదిర్చి
యెడ నెడను లోటు లెన్ని కారించుచుండె.

నోట దూఱు వలుక నోనాడఁ బోనాడఁ
గోపమునను కదురుకొన్నఁ గాని
మూకభరతుఁ డెపుడు మునినా గనారిలఁ
డొత్తి యాడఁ డెట్టియొఱకమునను.

ఱాతిపైఁ బడ్డనుదధార భాతి, తామ
రాకునందలిజలబిందువట్లు, తనదు
బంధుగుల ప్రేమ కోపతాపంబు లతని
యెడఁద నంటఁగలేవయ్యె నెట్టులైన.

కాల మీవిధి నెట్టులో గడచుచుండ
ననుజులెల్ల వివాహితులై కుటుంబ
గౌరవము నిల్పికొంచును గలసి మెలసి
జరుపుకొనుచుండ్రి గార్హస్థ్యసరణి నెత్తెఁగి.

అన్న లిచ్చుకదాయలు తన్ను నెన్న
డేని పిలువఁగ వచ్చుచు నితవు గలిగి
భరతు సోదరియుం దగుభర్తఁ గూడి
కాపుర మొనర్చు గామిడికత్తె గాక.

భరతు పెదతల్లి యార్యయు వార్ధకదశ
నాసిరిలి మిత్తిఁ బడియెఁ గొన్నాళ్లలోన;
తోరపుహత్తుగ సుఖములతో మెలంగఁ
దప్ప కవ్వాల డగరముల్ దాఁపురిలవె?

అనుజవర్గమెల్ల నామీఁద నొవ్వమి
వేఱువడిరి భేదవృత్తి మీఱి
కాని మూఁగభరతుఁ గనుఁగొనుచుండిరి
దినదిన మ్మొకొకరు తిండి నిడుచు.

రక్తసంస్పర్శ మధికానురాగయోగ
మును ఘటించుచునున్న; నపూర్వమోహ
పాశబద్ధత వనితలవలనఁ జెడదె;
కుండ వ్రేఁత్రెన వేఱగు గుణముకూడ.

దుద్దువెట్టెడిపలుకుల దోసఁగు లెన్నొ
పన్ని యెసకొల్పి పురుషులఁ బాపమార్గ
గాముల నొనర్పఁ గయ్యాలక్రచ్చ లైన
వనితలకుఁ గల్గుశక్తి యెవ్వరికిఁ గలదు?

ఆఁకవెట్టక పసిమాలి యన్నలెల్ల
జాఱుముడిగాఁ దనుం గనఁ జక్క నెఱిఁగి
యిచ్చవచ్చినరీతిఁ జరించుచుండె
భయము భక్తియు నుడిగి యాభరతుఁ డంత.

పురిని గాందారిమాందారిప్రొద్దువేళ
లేచి ముకుసూటి నేఁగెడుఁ జూచి యొరులు
పలుకరించినఁ దాను పల్లిలుకరించు
నేమినా నవకర్ణించు నెఱుకమాలి.

జోఱువాన లుద్ధాడించుచో నతండు
దురుపదమ్ములఁ దడియుచుఁ దిరుగుచుండు.
అంకపాంకము లగుప్రచండాతపముల
దూఁకటిం గొనకే తోడుతోఁ జరించు.

దుమ్ముదోఁ న కేశముల్, దుముకుఁజూపు,
లిచ్చవచ్చినవెఱ్ఱాట, లేపాం పాట,
లపరిశుద్ధకర్మంబు, లనాదరములు
వెఱ్ఱికిని వేవిధము లన్నవిధిని మసలు.

ఎవరు రమ్మన్న వెనువెంట నేఁగుచుండు
వారు కాఱోడ్డెములువల్క వా మెదల్పఁ
డెంతబరువైన మోసి వా రెద్దియైనఁ
గుడువ నిడిన భక్షించు నక్కడనె నిలిచి.

"జనులపరిభూతి నందుచు సంతతంబు
నీచగుణముల నేకాకియై చరించు.
జాల్మవేషముతోఁ బిశాచంబురీతి
వికృతభావంబుతో నుండు విప్రవరుఁడు."

ఊర నివసించుచున్నట్టియులిపికట్టె
ల్లగుమిగూడి యాతని నీడ్చి తెచ్చి
పెక్కువితముల నలిపెట్టః భీతు గొనఁడు
నిలుచును దిగంబరుండయి నిజ్జనీల్గు.

స్వస్వకార్యార్థమై పురి స్వార్థపరులు
కొంద ఱాతని బెనుదవ్వు కొంచుఁ బోవ
నంసభారిమై యూఁపరలాడఁ బోక
కొట్టినం దిట్టినం దుల్పుకొనుచు మఱలు.

“కడుపువెంట లాల గాఱంగ మాసిన
పాఁత గట్టి జనులు రోఁతపుట్టి
చేరకుండ నుపమచేసె నాత్మజ్ఞాన
సిద్ధి వృద్ధిఁ బొందఁ జేయుకొఱకు.”

ఇట్లు మానవసేవాప్రవృత్తిఁ దగిలి
విశ్వమర్త్యసౌభ్రాత్రసద్విధి నెఱింగి
అఖిల మాత్మేశ్వరార్పణం బనుచు నెంచి
నిత్యసంతుష్టి భరతుఁడు నెగడుచుండె.

# జడభరతుఁడు

## తృతీయ బింబము



చేరు వగుచున్నకొలఁది విచిత్ర మేమొ ?
యిక్కట్టుపాటులు గూర్చు సర్వేశ్వరుండు
కర్కశపరీక్ష చేసినఁగాని భక్తు
నుద్ధరింపఁగలేఁడో యాయూహ యేమొ ?

భ్రాతలందు శ్రీకంఠుఁడు భరతుఁ డనిన
అగ్గిపై గుగ్గిలం బటు లదరు లుమియు
ముక్తికాముఁడు మాత్రము శక్తివంచ
నంబు చేయక భరతు నెన్నఁడును విడఁడు.

ఇట్టిభరతుసవైఖరి నెఱిఁగి యెఱిఁగి
యనుజులం బిల్చి శ్రీకంఠుఁ డనియె; నీతఁ
డూరివారలపనులు రేయుంబవల్లు
సలుపుచుండఁగ మనపనుల్ సలుప లేఁడె ?

అచ్చు పోసిన యాఁబోతునట్లు లూర
విడువ దూటెక్కడే వీఁడు వేయు నేల ?
నేఁటినుండి నాపొలములో నీరు కట్ట
సస్యముం గావ నేమింతు జాలి యేల ?

అని కరాళించి శ్రీకంఠుఁ డనిన దాని
కనుమతించిరి మిగిలినయనుజులెల్ల
నంజిలింగొన కాతఁ డానాఁటినుండి
పొలముపనులెల్లఁ దీర్పంగ నిలిపె భరతు.

గునపముం బాఱ చేఁబట్టి గొప్ప త్రవ్వ
గట్టులంకలు వైచి యాఁకలిస మఱచి
నీరు బోదెల మరలించి పైరు గాఁచి
యన్న చెప్పినపనులెల్ల నతఁ డొనర్చు.

దుమ్మురమ్మున దేహము దోఁగి యున్న
చెమ్మటలు గ్రమ్మి తనువెల్లఁ జితచిత మన
రేలఁ జలివలి కాఱెంప లెక్క గొనక
కడుపుపెట్టక పనులు చక్కఁగ నమర్చు.

సర్వసంసర్గముల వీడి శాంతి నుండ
విధియె క్షేత్రకృత్యములు కల్పించె ననుచు
కృత్యము లొనర్చుపట్ల సర్వేశునందె
చిత్తమును లగ్నముం జేసి చేయుచుండె.

అట్టియెడల నడుమ నన్న శ్రీకంఠుఁడు
లేనిలోపములను లెక్కవెట్టి
కొట్టి మిట్టిపడుచుఁ గోపించుచు శపించి
దండతాడనములఁ దనుపు నతని.

దట్టకొంపుఁగనులఁ దర్జించి భర్జించి
కసిఁడికోఁతవెట్టఁగా రవంత
యున్న రనఁడు మెదలఁ డుద్దాడి పలుకఁడు
నిలువుపడెడిచూడ్కి నిమ్మళించు.

ఇట్లొనర్చుచు; శ్రీకంఠుఁ డింట నుండి
యిగిరికయొ సంకటియొ తెచ్చి యిచ్చెనేని
దేహధారణమునకయి తినును గాని
యెన్నడును వానికుచుఁ దానె న్నఁబోఁడు.

దండతాడనములె తనదినరోజుగా
పాలమువనుల భరతుఁ జెలిమి సలుప
చిత్తమందుఁ గలఁగి శ్రీకంఠుదౌర్జన్య
మరసి ముక్తికాముఁ డతని కనియె.

కన్నపెంచినతలిదండ్రు లున్న నీ య
మాయకుని దాఁకఁగలవె యన్యాయముగను
చేఁతయును రోఁతయును గూడఁ జెందె నింక
నేల వీఁ డిట ? నాయింటనే వసించు.

అనుచు నిట్టదొట్టునాగ్రహమ్ముం బూని
వానిదండఁ జేతఁబట్టి తనదు
సిక్కుపట్టు సేర్చి యిల్లాలికిం జెప్పి
భరతు నొప్పగించి పదిల మనియె.

వాసరాకకు నాతనిపత్ని లోన
నింట్రవడియును దనబిడ్డ నెత్తికొనఁగ
దిక్కు గల్గెను బిండితోఁ దీఱు వీఁ డ
టంచు మెఱిమెచ్చు నెఱపుచు నామె యుండె.

ఆలివంకవార లాత్మబంధువులును
మగనివంకవారు పగరలు గద!
ఎట్టిసతులకైన నిద్ది పుట్టుకదొట్టి
యలముకొనినరుజయె తొలఁగు నెట్లు?

అనుఁగుబిడ్డని శితికంతు నన్నకొమరు
నెగుబుజంబుల నిడికొని యెత్తి మోసి
భరతుఁ డెప్పుడుఁ జిందిలిపాటు గొనక
వదినె పూన్చినపనులు నెమ్మదిగఁ జేయు.

పరులదూషణభూషణభాషణమ్ము
లతనియాత్మఁ గలంచలేవయ్యె; నెపుడు
కూలికుఱ్ఱనిపోలిక బాలు నొక్క
గడియ దిగఁదాఁచ కాతఁడు గడపుచుండె.

ఈతఁడు విమాతృజుఁడు మన కేల యనక
భరతు నెప్పటికప్పు డేపాటిలోటు
తొడరఁగానీక ముక్తికాముఁడును గను చు
పేమ తొనఁకాడ మసలె నెబ్బెతిక మేది.

# తృతీయ బింబము

పూరాణమున కెంత గల్లనీ గారవంబు
నోహదం బిడి వనిత తాఁ దోడుపడఁద
యేని యాతనియాదర మేటఁ గలసి
గారవంబెల్ల గగ్గులకాఁటఁ గలియు.

ఇట్లు భరతుఁడు సోదరునింట నుండ
స్వామికల్యాణ మప్పురి జరిగె నొకపు;
డేనుతిరునాళ్ల కేల నూరేఁగువైభ
వముల భరతుఁడు దర్శించెఁ బరమభక్తి.

సంజకడ నుత్సవము చూడఁ జనినయాతఁ
డొక్కదినమున జాముప్రొద్దెక్కువఱకు
నిల్లు చేరమి వదినె గర్జిల్లి క్రేటు
కొనుచు మఱఁదిని గాంచి యిట్లనుచుఁ బలికె.

ఓరి! తిండిపోత! యూరెల్ల రేవగల్
తిరిగి సిద్ధమైతె తిండివేళ
తప్పకుండ; వెఱ్ఱితన మేడ? నీజాడ
చూడ మాకు వేఁకి సోఁకుఁ గాక.

తెలివి యున్న లేకున్న నీ తెల్వి మాత్ర
ముండె నీకడ; సావధానుండ వగుచు
మప్పిదమ్ముగ మెక్కుట మరువఁబోకు
చెడుగ యనుచును విసువు దుండుడుకు మీఱ.

కంచమందున మాఁడు సంకటియుఁ గంపు
ద్రబ్బెడయుఁ బెట్టి యేరండతైల ముంచి
తిను మనుచుఁ బెట్టఁ గిక్కురుమనక భరతుఁ
డారగించెను బరమాన్న మటులు తనిసి.

ఆత్మభేదంబె లేనిమహామహుండు
యోగి రుచిభేద మెన్నునే రోగి వోలె ?
దేహధారణకై యేదొ తినుట తప్ప
భోగివలెఁ గాంక్షలిడునె వైరాగి యతఁడు ?

తత్త్వదర్శిదృష్టి తా గ్రహింపఁగలేక
యదియె తగినశాస్తి యనుచు వదినె
దినదినమ్ము కుడుపఁ దినుచు యథారీతి
మసలుకొనెడి భరతమౌనితోడ.

# తృతీయ బింబము

ఓయి! పేరంటమున కేను బోయి వత్తు
నూలప ప్పెండఁబోసితి నుసల కిపుడె
వడిగ నోహరిసాహరి వచ్చిపడెడి
పులుఁగులం బెదరించుచు సిలువు మింట.

జాగరూకుఁడ వై యుండు జడ్డువడకు
మెఱుఁగుదువుగాదె తబ్బిబ్బు లేమి యైన
నీయొడలు నీదికాదిది నిశ్చయమ్ము
నీచిరాకు పరాకు మన్నింపఁబోను.

అనుచు నాతని కాఁపుంచి యరిగె నామె;
భరతుఁ డాకడ నాసనబద్ధుఁ డగుచుఁ
జూచుచుండె; నాలోనఁ బిచ్చుకలగుంపు
వచ్చి వ్రాలెను పర్యంతవలభులందు.

అంత భరతుని గాంచి పతంగకులము
పిచపిచం దమభాషలోఁ గిచలుకొట్టి
బెదరి వెనుముందు లాడి కుప్పించి యెగసి
బుఱ్ఱునం బప్పు మెసవుచుఁ బోవుచుండె.

ఏనియుఁ బక్షులయులజడి విననియట్లు
వానివైఖరి కనియుఁ దాఁ గానట్లు
భరతుఁ డటనుండియును లేనివాఁడై యగుచు
మేనితో మాత్ర మాకడ మిగిలి యుండె.

స్థాణువుంబోలె నంధునిసరణి నున్న
యతఁడు వానియాహారవిహారములకు
విఘ్నముం గూర్పకయె, తత్ప్రవృత్తియేని
లేక, యంతర్ముఖుఁ డయి ఖేలించుచుండె.

అతనిభావము పసిపట్టినవియుఁ బోలె
మందమందలై పక్షు లమందగతిని
నిర్భయమ్ముగ వ్రాలి తన్నికటమందె
నూలపప్పును మెసవంగ నూలుకొనియె.

అంత జేనెంట జుత్తెంట నంత కంత
కతసిముంగిట వెనుకట నన్నిదెసల
మసల నాక్షుద్రజంతులమాటె లేక
ఱాత మలచినప్రతి మయ్యె నాతఁ డచట.

గాజుకనులబొమ్మ కాఁబోలు నిది యని
భరతు బుజములందు వ్రాలి కొన్ని
తలను నిలిచి కొన్ని మెలఁగుచు నోడిఁ గొన్ని
దాఁటుకొనుచుఁ గొన్ని తాలు చుండె.

ముకుపుటమ్ములు వ్రామినఁ గకవిక లయి
మీఁద రెట్టలు వెట్టిన మొదల కున్న
నుదరి తండతండములు లక్షోపలకు
లగుచు నూలను భక్షించె ఖగములెల్ల.

తెక్క లల్లార్చి ముక్కుల రేఁచి రేఁచి
గోళ్ల గింజలు చిమ్మి గగ్గోలువెట్టి
చీమ చిటు కన్న రివ్వునఁ జెదరి పర్వి
భయ మెఱుంగక సాపడెఁ బక్షులెల్ల.

అంతఁ గొంతవడికి నాయమ బంధుగ్ర
హాన విందు కుడిచి తాను సుతుఁడుఁ
బొడ్డినడలతోడఁ బేరంటముం దీర్చి
యిల్లు సేరి యిట్టు లెంచె మదిని.

పిండివంటలతోడ నింపికొనినట్టి
నిండుపొట్టలు మావి, యానీరసుఁడు
తిండితిప్పలు లేక కాఁపుండె నింటఁ
బాప మన్నము నిడవలె భరతున కని;

గృహకవాటము తెఱచి ముంగిలికి నడువఁ
గంటఁ బడె లోనిదురవస్థ కాంత కెదుర
భరతుఁ డొకదిస్టిబొమ్మనాఁ బరిఢవిల్లెఁ
బిట్ట లుడ్డయించెను బీచుపీచు మనుచు.

గోటిబలుకులు ముక్కు-అక్కులును రెట్ట
లెఱక లాడలెల్లఁ గాన్పింపఁ బరవశత్వ
భావమున మూల కొదిగి యప్పగిదినున్న
భరతు వీక్షించి యామె సంభ్రమముమీఱ.

మలఁగి తొలఁగి కలఁగి మధ్యాహ్నమార్తాండు
కరణి మండిపడి వికారదృష్టి
పఱపి వేదురెత్తి బాధింప సమకట్టి
దండ మూని భరతుదండ నిలిచి.

విఘ్న విరామములేక యావేలఁది యతనిఁ
దాడన మొనర్చె సంధిబంధములు ప్రిదుల
దుర్భరాఘాతముల భరతుండు సొమ్మ
సిల్లెఁగాని నోరెత్తి భాషింప లేదు.

చావ దెబ్బలు తినుటకే చాలెఁ గాని
భోజనమునకు దూరుఁ డైపోయె నతఁడు
పుండ్ల నెత్తుట నీఁగలు మూఁగి గొలుకఁ
బుడమినిం బడి మూల్గుచుఁ బొరలె నతఁడు.

కలక చెందుచు విషయ మగ్రజుఁడు తెలిసి
దగ్గఱకుఁ జేరి కన్నీటఁ దడుపుచున్న
బాధ తెలుపఁడు పల్లెత్తుపలుకు పలుకఁ
డేమి ప్రారబ్ధకర్మమో యెవరి కెఱుక?

* * * *

ముక్తికాముని వాత్సల్యమునకు నేని
వదినె తనయెడఁ బచరించువరున కేని
పొంగ కీడాడ కెప్పటి పోల్కి భరతుఁ
డెట్టి తొట్రుపాటులు చూపకే చరించు.

అట్లు గడపుచు నొక్కసాయాహ్నమందు
బిడ్డ నాడింపు మని యానపెట్ట వదినె
బుడుతవానిని దనబుజంబుల నిడికొని
యనుకొననిచోటి కెటకో తా నరుగుచుండె.

చిత్త మితరథా పరిచింత సేయు చుండె
గన్నుఁదోయి పరధ్యానకలిత మయ్యె
నడలు తడఁబడుచుండె; బాలుఁడును మెడలఁ
గునికి జోగుచు నుండెఁ దాఁ గనఁడు సుంత.

అటులు పోఁబోవుచుండ మార్గాంతరమునఁ
గనులఁ బడెఁ గనత్కనకదీప్తిని వెలార్చు
కరములను జాపి తన్ను దగ్గఱకుఁ బిలుచు
కైవడి నెసంగు దేవతాగార మొండు.

దైలువాఱెడుభక్తితాత్పర్యములు తో
లంక భక్తులు నిల్చి రాలయములోన
గజ్జఘంటాగళమ్ము లోంకారములను
బలుకుచుండెను పదరి కపర్దిమ్రోల.

భారతి కాసించి యొడలఁ దాంబూలపుష్ప
ఫలములం బట్టి భక్తిప్రపత్తు లొలుకఁ
బట్టుసేలల్ కువాళించి భక్తులెల్ల
దేవదేవుని కర్పింపఁ దివురుచుండ్రి.

'యాని కానిచ పాపాని' యనుచు గుడిఁ బ్ర
దక్షిణించుచున్నారు కొందఱు నడిఁకి
హరహరా! మహాదేవ! యం చార్పు లంత
దళకొనుచు నుండె మంటపాంతరమునందు.

బాఱులుగఁ దీఱి యార్ద్రాంగవస్త్రములను
బాణులం గప్పి యాసనబద్ధు లగుచు
కనులు మోడ్చి పంచాక్షరీమననములను
జలుపుచుండిరి కొంద ఱోష్ఠములు కదల.

ఆయకించనుహృదయగుహాంతరమున
మెదలుసీతిబాధలరీతిఁ గదురుకొనుచు
దీపకళికలు లోగుడిఁ దేజరిల్లె
రగులుముక్కంటికనుమంటరవలరీతి.

గాఢరుద్రాక్షమాలలు కంఠములను
మర్మరధ్వని సలుప నిర్మాల్యభాజ
నంబు పాదుకల్ పట్టి సంతతము శివుని
మ్రోల నిలుచుండి రర్చకముఖ్యు లెల్ల.

దేవళములోని దేవాదిదేవదివ్య
మంగళసువర్ణమూర్తి, చంపకశిరీష
మల్లికామాలతీకుసుమములఁ దోఁగి
నిండుగా నుండి కన్నులపండు వయ్యె.

ఆర్ద్రచందనపరిమళ మతిశయించె
గమగమించెను ధూపధూమముల తెగలు
భవ్యనీరాజనములసుప్రభలు వెలిగె
మంత్రపుష్పముల్ జేపెట్టె మధురగతిని.

అట్టియాలయశోభ నల్లంత గాంచి
చిత్త మీశ్వరాయత్తమై చిందులాడ
భరతుఁ డమితచిదానందభరితుఁ డగుచు
భక్తిపరవశుఁ డయ్యెఁ దత్పరత మిగిలి.

అప్రయత్నముగా స్వీయహస్తయుగళ
మీశ్వరాధీనమై ముకుళించికొనియె.
కన్నుఁదమ్ములు మొగిడి శంకరునిపాద
కంజముల నైక్య మందెను గట్టి నిలిచె.

అంతట బుజాల నొఱఁగినయర్భకుండు
తాళఫల మట్టులు దురీన నేలఁగూలె.
శిరము గాయమై నెత్తురు చింద బుడుత
గోలుగోలున రోదించె గ్రుక్క పట్టి.

వచ్చిపోయెడివార లావరుస గాంచి
బుడుత నొడి చేర్చి యూరార్చి బుజ్జగించి
జడునివలె నున్నభరతుఁ దర్జన మొనర్చి
వడినెకుం దెల్పి రాతనివరుస లెల్ల.

అంత నాయమ చెండుబెండాడు కరణిఁ
గసిమసంగుచు భరతునికడకు వచ్చి
యనవినగఁ రానిదుర్భాష లాడిపోసి
తాడన మొనర్చె నొడలెల్లఁ దట్లు రేఁగ.

ఎవ్వ రేమి యనిన నేమియు నెఱుఁగఁడు
మనసు లేదు నోట మాట రాదు
కనులు తెఱచి కాంచఁగాఁబోఁడు భరతుఁడు
కనిన బేలచూపె గాన నాను.

బిడ్డ యేమయ్యెనో యని బిడియపడఁడు
ఏల కొట్టెద వంచుఁ బ్రశ్నింపఁబోఁడు
వదినె యేమే మొనర్చిన మదిఁ గలఁగఁడు
అనుభవించుటె కాని కిమ్మనఁడు కనఁడు.

అట్లు భరతుని బాధించి యామె వాని
నింటికిం జేర్చి బంధించి యీఱసమున
పీసి 'భరతము పట్టింప' లేనె? యనుచు
పతికి నెఱిఁగించె భరతుకాపథములెల్ల.

పట్టిగొడ్డు తాఁ కట్టుగా వచ్చె నీతఁ
డకట! జోపాప నాడింపనైన లేఁడె?
తిండి దండుగ మనకొంప తీయుకొఱకె
దాఁపురించె వీఁ డనుచు భేదంబువెట్టె.

ఆమెపలుకులు విని ముక్తికాముఁ డతని
దరికి నరుదెంచి యనుజవాత్సల్య మొప్పఁ
దడవె నాతనియొడలెల్లఁ; దత్త్వ మతని
కవగతం బయ్యెఁ; నిల్లాలి కనియె నిట్లు.

ఓసి ! ఆతిగుండెలదాన ! యొప్పెనే మ
నంబు భరతుని బాధించి నవయఁ జేయ ?
నుతిచి నుగ్గించి యకట ! యీనోరుమొంగఁ
బట్టి వేధింతె ? పరమనిర్భాగ్యురాల

అకట ! నీబిడ్డ యొకఁడు; వీఁ డొకఁడునటవె ?
నడిగదే యిది; ఓపాపజాతికాన !
చేతితోఁ దెచ్చికొంటి నీపాతకంబు
అది లోపము నాదె; నిన్ననఁ బనేమి ?

లోకవాసన లేదు; లోలుండు గాఁడు
ఎన్న నెఱవాదిగాఁ దన్నెపున్నెములను
తెలియనేలేఁడు, జడుఁడు నీతెలివి కాల
నుఱు మొనర్తువె ? యొడ లిట్టు లుఱుక మొఱక !

కన్న పెంచినతలిదండ్రు లున్న వీని
కిట్టి దురవస్థ లేక పోనేమొ యకట!
గ్రుడ్డివాఁడైన వెఱ్ఱియై కుటిలుఁడైనఁ
గన్నకడు పట్లు నీ కేల గ్రాలు తీపి?

అనుచు నిర్వేద మంది యే మనఁగలేక
ముక్తికాముం డచటు వాసె మోము ముడిచి
భరతుకతమున దూఱందవలసెఁ దన క
టంచు ననసూయ వాని నఱ్ఱాఁచుచుండె.

ఆమె పతి యింట లేకున్నయపుడు మఱఁది
కేదియో వేళ కోకకోంత యిడును భుక్తి
పనికి దోంగంచుఁ బసులశాల బాగోనర్పఁ
జేయుచుఁ గరీషపిండముల్ చేయఁ బూన్చు.

పెరటివాకిండ్ల నూడ్పించుఁ దరము వెట్టి
నీరు తోడించి కలయంపి నెఱపఁ జేయుఁ
జేరుడుల నడిగండ్లు తా నేరఁ బనుచుఁ
దోడరి యుచ్ఛిష్టపాత్రలఁ దోమఁ బనుచు.

ఎన్నియొడిచుట్లు పెట్టిన నెట్టికార్య
ములనొనర్పంగఁ బనిచినఁ జలన మంద
కాతఁ డొనరించి, పెట్టినయది భుజించి,
కర్మపరిపాకదశకయి కాఁచి యుండె.

వర్ష ఋతువున గ్రీష్మాన వరలునట్టి
స్థితులు గతులును నదులందె తేటపడును
గాని; యామహాంబుధి నవి కాననొనె ?
భరతువైఖరియును నట్లె పరిఢవిల్లె.

*           *           *           *

జరుగుచుండఁగ భరతుని జాడ లిట్లు
ముక్తికాముం డొకానొకముఖ్యకార్య
కలన గ్రామాంతరం బేఁగవలసి వచ్చె
నప్పు డిల్లాలి కాతఁ డిట్లనుచుఁ బలికె.

ఓసి ! భరతుభారము నీది; గాసిఁ బెట్ట
కతనిఁ గాపాడుచుండు నీసుతుని రీతి
ఇంటఁ జిదగొద లేమి కల్పింపఁ బోకు
మరలి వత్తు వారమున కం చరిగె నతఁడు.

అదియె యదనుగ ననసూయ మదిఁ దలంచి
లేనిరుజలెల్లఁ దాను గల్పించికొనుచుఁ
బని గొనంబూనె ముప్ప్రొద్దు భరతువలన.
చాన లెంతటిదబ్బఱల్ సలుపఁ దగరో ?

అయ్యరాకయు నాలస్య మయ్యె నంతఁ
జెలికపట్టులుఁ గోఁతకు సిద్ధ మయ్యె
ఏనడికిరేయి మునిమ్రుచ్చు లేపు రేఁగి
సస్యము హరింతురో యని చాన జడిసె.

ఇన నొకకొంత దిటదేఱి యామె భరతుఁ
జేరి మీయన్న యింటికిఁ జేరువఱకుఁ
బంటపొలమునఁ గాఁపుండవలెను రేల
ననుచు నేమించి భరతుఁ దా ననిపె నటకు.

పంట పోకుండ తస్కరభయము లేక
కాఁచికోలున కర్హుఁడు గా దటంచుఁ
దలఁచియే యామె మానిసియలికి డైనఁ
జాలు ననుకొని పుచ్చె నీగోల నటకు.

అంత భరతుఁడు పొంగారుసంతసమున
నీప్రశాంతపరిస్థితి నీశ్వరుండె
నాకు సమకూర్చె ననుచు ధ్యానైకనిష్ఠ
నడవిపొలమున మంచెపై నమరియుండె.

అది యమావసిరాత్రి గాఢాంధరేఖ
సూచిభేద్యము గాకుండఁ జూఱపుచ్చె
ప్రకృతి నిష్పంద మాచు నేవికృతి లేక
రహి వహించెను గాలగర్భమునఁ దెండి.

ఆనిశాదేవినీలాంబరాంతరమున
భువనములు పొంచి దాఁగిలిమూఁతలాడు;
అచటిరక్తాంబరానది యద్ద మట్టు
లంధకారాన మిలమిల లాడిపోయె.

కోటికన్నులు విచ్చి యానాఁట నేదొ
నెమకుచున్నట్లు చుక్కలనింగి తోఁచె
ఎడఁ దెఱపి లేనిచిమ్మట్లయీల లలమి
చెవులు గింగురులెత్తె గ్రాచ్చినవిధాన.

ఆయడవిఁ గాళరాత్రి నేయదపు లేక
యొంటరిగ భరతుండు కాఁపుంట యెఱిఁగి
ప్రక్క బాటెంటలో నున్నపల్లె నుండి
సస్యము హరింప వెడలెఁ దస్కరులగుంపు.

మెలికమీసాలు జుంజుఱుతలలవారు
దివ్వెకోలలవారు నిస్త్రింశధరులు
కెరలుకలుఁ ద్రాక్కుచేఁ దొట్రుగిల్లువారుఁ
గడఁగి చేరిరి జోకలుకట్టుకొనుచు.

దొమ్మి రేఁగుచు వారు దుందుడుకు గదుర
నిండఁబడి చేసిసస్యము నిర్నిరోధ
రీతిఁ గోసి రాయద్దము రేయి వేళ.
బందెపోటుల కేల యిబ్బంది లెందు ?

అంతలోఁ, బోక వా రాత్రియామ వేళ
జువ్వరించుచు భరతుని జుట్టి పట్టి
దుందుబలి వహ్వారే! వీఁడు దొరకె ననుచు
ప్రముచ్చుదుముదారుదొరఁ జేర్చి మోకరిలిరి.

బాబయా! మగమొల్క సంప్రాప్తమైనఁ
గాళిసత్తికి నరబలి కడఁగి చేయఁ
బలికినాఁడుగదా సామివారు నాఁడు?
నెఱఁబడదె వీనఁ దమపూర్వనిర్ణయంబు.

అనుచు నాతోఁడుఁబోతులు మనవిచేయఁ
బలికె నాదణా పెద్ద సంబరము మీఱ
ఔనురో! వీని బలిపెట్టినట్టులైన
సత్తి సంతస మందు నాసామి! రంగ!

అనుచుఁ గోఁపులుద్రొక్కుచు నతఁడు భరతు
మెదలనీక కట్టుం డని ముదలవెట్ట
డిల్లవోవఁడు నెట్టోడఁడే! రవంత
పలుకఁ డులుకఁడు మనజడభరతుఁ డకట.

అంత మునిమ్రుచ్చు లెగసి కేరింత లిడుచు
భరతుమెడఁ బట్టి కెడపుచుఁ దరలి చనిరి
మోఁపులంగట్టి మిగిలిన మొఱకు లెల్లఁ
బైరు గూడెము సేర్చి రేబంది లేక.

దొంగ లిట్లు భరతుఁ దోడ్కొని చని చని
యడవిలోని కాళిగుడికిఁ జేర్చి
పంతగించి యతని బలివెట్టఁ దలఁచిరి.
పుల్కసులకుఁ గలదె పుణ్యచింత?

ఆవల వార లాతనికిఁ దలంటి పోసి
యిష్టమృష్టాన్నముల భుజియింపఁ బెట్టి
గంధపుష్పాక్షతసువర్ణకలితుఁ జేసి
బలికి సిద్ధ మొనర్చిరి భరతమునిని.

అఱుతెఁ బునుకలమాల, కెంపాఱుకనులు
పెనుపటాకత్తి చేత; ముక్కున బులాకి
నట్టడవి పుట్టినిల్లుగా నాంతజంతు
సంతతుల గావుకొంచట సత్తి వెలిగె.

శక్తిముఖగహ్వరమునుండి జాఱువాఱు
దీర్ఘజిహ్వాక రక్తనదీప్రవాహ;
మామెముఖమండలంబు కృతాంతువిలయ
తాండవక్రీడ సలుపు నర్తనపుశాల.

ఆమెతాఁగుడిముంగిలి నావరించి
యాకసము తాఁకె నొక్క కింపాకతరువు.
గలలకాయలలెక్క యిగ్గడ నడంగె
నిన్నిజీవంబు లనుచు లెక్కించి నుడువ.

మేకపోతుల గొఱియల నేకలములఁ
గోళ్ల బలిపెట్టి యచటఁ బ్రోగులుగనిడ్డ
వెగ్గలపుఁబచ్చిసంజుళ్లవిక్రయములు
సాగు నెఱవెట్టి గొలుకఁగ నీఁగగములు.

అట్టికాళిక కట నర్చనాదివిధులు
చలుపుచుండిరి నాయకశాసనమున
జూదరులు జుమ్మికాండ్రు ముచ్చులును బెచ్చు
కూడి త్రోపాడుచుండి రాగుడికి నెదుట.

కాళ్లగజ్జియ లంత గల్గల్లు రనఁగ
వేఁపరివటలు మొలయందు వ్రేలియాడఁ
గుంకుమాంకలలాటుఁడై గుగ్గిలంపుఁ
బొగ లెగయఁజేసె నాసాదిపో తొకండు.

పిదప హారతిపట్టి యాబిఱుముమగఁడు
తస్కరస్వామిఁ బిలిచి "సిద్ధముగ నుంచి
నాఁడవే యుపహారము నరపశువును
గుడికి రప్పింపు" నునుచు వాకొనుడు నంత.

పసిమిమిసమిసచిఱు బంతిపసుపు మోము
నిసుపుకుంకుమతిలకంపునిటలతటము
వలికి నూఁగాడు వేఁపరివ్వాలు గలట్టి
మెడయు, రక్తాంబరమ్ము తో ట్రడరునడలు.

కలుగఁ గరబంధపాశసంకలితు లగుచు
నచటియాబాలగోపాల మనుగమింప
భూరివాద్యఘోషమ్ములు బూరటిల్ల
భరతు నీడిచి తెచ్చి రబ్బలియు రెల్ల.

"తుచ్ఛదేహబంధం బింతతోఁ దొలంగ
నాపరేశ్వరునాజ్ఞ యి ట్లైన దేమొ ?
సమసెనేమో మదీయదుష్కర్మ ఫలము
ఎవ్వ రెఱుఁగుదు రేనాఁటి కేది గతియొ ?

ఎటుకే లల్లాడ్చి గాలిలో నెగుర లేక
అలసి పడుచు లేచుచుఁ బోవుపులుఁగు; తనదు
గూడు నట్టి లీయెమ్ములగూడు వీడి
యరుగ నీదేహి కిఁకఁ గాల మైనదేమొ ?"

అనెడితలఁపు లేవేవియో యంతరంగ
మందు రేకెత్త భరతుఁ డేయదరు లేక
కీలుబొమ్మనా వర్తిల్లె; నేల కలఁగు
యోగి దేహసంయోగవియోగములకు?

అంత నాతని వధ్యశిలావరోహ
ణమ్ము గావింపఁ జేసె నానాయకుండు.
పానకము పప్పుఁ గుంకుమ పసుపు లిడుచు
లీలఁ గాళికి మ్రొక్కు చెల్లించికొనియె.

ఏటునకు వేశిరస్సులు మీటివేయు
వాట మౌవేఁటకత్తితో నచ్చె నొకఁడు.
దండకమ్ము పఠించె వాద్యములు మొఱసె
కత్తి భరతునిశిర మూర్ధ్వఁ దత్తరించె.

మొగ్గపలుచాలు తెలిడాలు ముసురువెట్ట
చిర్నగవు పల్లవోష్ఠాలఁ జిందులాడ
భరతుమన మప్పు డెట్టికింకిరిని బడక
ఆదిశక్తియుం ద్వైక్యము నంది యుండె.

"బ్రహ్మభూతాత్మకుండు నిర్వైరుఁ డఖిల
భూతసఖుఁ డగుభరతుప్రభూత తేజ
మపుడు దుస్సహ మాచు భయంబు గొలుప
భద్రకాళియుఁ గడగడ వడఁక దొడఁగె."

అంత వికృతాట్టహాస మయ్యాదిశక్తి
భయదముఖగహ్వరమునుండి బయలువెడలె.
ఒక్కహుంకారటంకార ముఱిమికొన, గు
భీలునం గూలె ఆగుడి ప్రిదిలి కదలి.

ఆలతాఁకునఁ గొంద ఱత్రాఁకవడిరి
అవనిఁ బడి చదిసిరి వికలాంగు లైరి
కుదిసి బడిగంటఁ బడ్డకొక్కులవిధాన
నడఁగి; రతిదారుణము కట్టిగుడుప కున్నె ?

"విప్రవరు నట్లు హింసించువృషలపతిని
భృత్యవర్గంబుతోఁ దలల్ పృథివిఁ గూల్చి
యపుడు వృషలాధిపునిశిర మంది దేవి
పాడి యాడుచు నందంద క్రీడ సలిపె."

మిగులుకొన్నవారు మిరుమిట్లు గొనఁ గనుల్
గుండె లగలి సొమ్మఁ గూలి రవని
శాంభవీకటాక్షచంచత్కృపాడోలఁ
దూలి యాడె భరతబాలమాని.

కడఁగి యీచరిత్ర గ్రామాంతరాగతుం
డైనముక్తికాముఁ డంతఁ దెలిసి
నెమకి నెమకి భరతునిం గనఁజాలక
దైవగతికి వగచెఁ దత్త్వమెఱిఁగి.



# జడభరతుఁడు

## తురీయ బింబము

---

కను గలిగినట్లు కాలము గడువఁ గొంత
పాలితయశుండు సింధుభూపాలమౌళి
తత్త్వవిజ్ఞాన మెఱుఁగంగఁ దలఁచి, కపిలు
నాశ్రయింపఁగ వెడలె వనాంతములకు.

ఆతఁడు రహూగణుండు వేదాంతవేత్త
యయ్యుఁ దలఫూవు వాడనియమితభోగి
రాజసము రూపుగొన్న రారాజె యయ్యుఁ
బ్రజలఁ జల్లఁగ నేలినప్రభు వతండు.

పికిలికుచ్చులు బంగరుచికిలిదిండ్లు
రవలరవరవ లొప్పుపల్లకిని నెక్కి
మోయ నిరుగడ నీరాఱుబోయవాండ్రు
వెడలెఁ గపిలాశ్రమమున కాపుడమిఱేఁడు.

దట్ట మగునాగపున్నాగతతులు మెరయు
నిక్షుమతితీరమందె యాఋషివతంసు
నాశ్రమం బుండు; దాని నెల్లైనఁ జేర
నేటి కెదురీఁదినట్లు రా జేఁగు చుండె.

తడవులంబట్టి బెస్తలు దారి నడువ
నలసపడిపోయి రాగహానాంత భూమి
బుజముమార్పున కెవఁడైనఁ బొసఁగునే మొ
యనెడిమూసలు కొందఱి కావటిల్లె.

అంత మాంసలమసృణ దేహంబుతోడఁ
గ్రాలుభరతుఁడు బెస్తలకంటఁ బడియె.
"శిబిక మోపింత మీతనిచేత నంచుఁ
బట్టి మూఁపునఁ బల్లకిఁ బెట్టి రపుడు."

శిబిక మూఁపున నిడి యెట్టిచింత లేక
అప్రయత్నముగాఁ దప్పటడుగు లిడును
మోఁపరులగొంతు కల్పి తా మూల్గ లేఁడు.
సరి నవభ్యస్తవిద్య విషంబుగాదె ?

పరువుపరువున వారితో నరుగ లేఁడు
విషమసమతలకథన కావింపఁ బోఁడు
అడ్డదిడ్డముగా నడ లానుచుండ
నొడ్డగెడ వయ్యె నాందోళి యూఁగులాడి.

విషమగమనంబుకతన నావిర్భవించి
నట్టికుదుపున నృపతి యాయాస మంది
యురవడించుచుఁ బల్లకీయూడిగీల
కనియె దేహాభిమానము తోనఁకియాడ.

“ఓరి ! యుద్దంతురం బగుదారిఁ బట్టి
నడువ నతలకుతల మయ్యె నాశరీర
మింత తప్పనదారు లై రేల ? మీరు
తలకు మించెన పొగరు పెద్దటికె మెడలి.

రాజు నాక మమ్ము లక్ష్యమ్ము సేయక
దుడుకునడల వెడలుధూర్తు లై రె ?
చీఁకు గదిరి మీదురాకడ లి ట్లైన
గచ్చువడదె నాదు కార్య మిపుడు.”

అనుచుఁ గూఁకలువెట్ట బోయలును సామి!
లేదు దోసము మాయెడ వాదు లేల ?
నూతనుం డాతతాయి యీమోఁతగాఁడు
వేఁకరం బయ్యె నియ్యెడ వీనికతన.

అనఁగ తేఁ డోరిజీవన్మృతా ! కుశీల !
లోహపిండమువలె నింత దేహ ముండె
సత్తి మొత్తఁగఁ జాలుదు; చాలవోటు
పల్లకీ మోవ నిది యెంతభార మౌర ?

"త్రోవ నడిచి, చాలదూరంబు వచ్చుట
వీఁక శిబిక మోవలేక మిగుల
నలసినాఁడవో ప్రయాసంబు నీ కౌట
యెట్లు ? పీవరాంగ మింత గలిగి."

అనుచు దూఱాడ నెప్పటిమాట యయ్యెఁ
గాని భరతునిలో మార్పు గానఁబడక
శిబిక బాధింప రారాజుచిత్త ముడుకఁ
బల్లకిని నిల్పి భరతుతోఁ బలికె నలికి.

"అరరె! యోరిద్విపాత్పశువా! వచింపఁ
దెలియఁబోదఁటరా! యోరితెక్కలీఁడ!
తేనిముదల కవజ్ఞయో? కానఁబడవొ
కనులు? కడికండలోనరింతుఁ గాయ మిపుడె.

దుర్మదాంధుఁడ వగుచు దుందుడుకు మీఱి
నాదునాజ్ఞను దప్పించి నడచెదవుర?
వక్రమార్గంబు లిన్ని పోవంగఁ దట్టి
నడువఁజేయుదు నిన్ను సన్మార్గమందు.

లేవె మానావమానముల్? నేరవే? పొ
కాలెనే బుద్ధి? మోవంగఁ జాలకున్నఁ
బ్రాముళ్ళ నిర్భాగ్య!" అని తిట్టిపోయె రాజు
భరతుఁ డనెను జిదానందభరితుఁ డగుచు.

సత్యమే రాజ! నీవాక్యసరణి యెల్లఁ
గాని దేహాభిమానము మానె నాకు
ఇపుడు మోఁచువాఁ డేను మోఁపించికొనెడి
వాఁడ వీవున? యీభేదభావ మేల?

తేఁడ! అంతరతత్త్వపరీక్ష నెఱప
దేహదృష్టిని పాంచభౌతికము లివ్వి,
ఆత్మదృష్టి నేకంబె తాను గాదె?
ఇంక నీ నా నడుమ భేద మేమి గలదొ?

శిబికదండము బుజము స్పృశించి యుండె
నైన నే మోఁచుచున్నాఁడ ననెడి భ్రాంతి
పాఱదే రాజ! దేహాత్మభావనమున
రాజసుఁడ వౌట నీ కుంట సాజమౌను.

"నీవు శిబికలో నుంటయు నేను దాని
బరువు మోయుట రెండును బరమమిథ్య
లెవ్వ రెవరిని భరియింతు? రెల్లజంతు
వులఁ బృథివ్యాది యగుభూతములు వహింప."

స్థౌల్యకార్శ్యంబు లాధు లిచ్ఛావిరోధ
రోషనిద్రాభయజరాదిరోగములును
గలుగు దేహంబుతోడన; కాని జ్ఞాని
గణనసేయఁడు వానిఁ జిత్రాంతికలన.

"మృత్తికాగేహములు మంటిమెత్తడముల
దృఢములగుగతిఁ బార్థివదేహచయము
పార్థివము లైనగోధూమఫలయవాది
పోష్యమాణంబు లై దార్ఢ్యమునఁ జెలంగు."

పాంచభౌతిక మీమలభాండ మెపుడొ
పగిలిపోవును దీనిపై భ్రాంతి యేల
దీనిసంబంధ మేనాఁడొ త్రెంపుకొంటిఁ
జెండినం జీల్చినను బాధ చెందఁబోను.

ప్రభువ! నే నొక్కరుఁడనె జీవన్మృతుండఁ
గాను నాద్యంతములు గల్గుప్రాణికోటి
యెల్ల జీవన్మృతము కాదె? యెఱుఁగ కీవు
పలికి తధికారదోష సంపర్కవశత.

స్వామిభృత్యసంబంధ సంభావనమ్ము
విధికృతం బాచు వ్యవహారవేద్యకలన
దేహముల కగుఁ గాని యీదేహి కెప్పు
డంటఁగాఁబోదు రాజరాజా! గ్రహించు.

"ఎల్లప్రజలకు రాజగుఁ, దల్లిదండ్రు
లకు సుతుం డగు, సత్పుత్రులకును దండ్రి,
తనదుభార్యకు మగఁ డగు, ధరణినాథ!
యిన్నిసంజ్ఞలు గలనిన్ను నెవ్వఁడండ్రు?"

ఆనవెట్టుదు వీవు రాజాభిమాని
వగుచుఁ బూర్వస్వభావ మ ట్లాటకతన;
సతత ముస్మత్తమూకాంధజడులఁబోలె
నెడలునా రేడ? నీశిక్ష యేడ చెప్పుమ?

నీ వహంకారమూర్తివై నిన్ను నీవె
కాననిస్థితి నుండి యజ్ఞానభార
మూని యున్నాఁడ విటు నిష్ఠురోక్తు లాడ
నెట్లు వెనుకాడెదో ధరణీశ! చెప్పుమ?

"దేవతిర్యఙ్మనుష్యాది దేహభిత్తు
లెవ్వియును నాత్మ గాదు నరేంద్ర! యీ వి
కార దేహంబు లెల్లను గర్మ యోను
లనుచుఁ జెప్పుదు రప్పరమార్థవిదులు."

"ఇల నభేదస్వరూపతఁ బొలుచుగాలి
వేణురంధ్రములను జెంది వివిధగతుల
షడ్జముఖ్యస్వరంబులసంజ్ఞ లొందుఁ
దనకు భేదము గలుగ దద్వైతమిదియె.

అనఁగ భరతునిముఖపద్మమందునుండి
పరిమళించిన తాత్త్వికభాషణముల
నాలకించి జిజ్ఞాసువై యరుగుచుండెఁ
గాన నొకకొంత తెలివిడి గనుచు ఱేఁడు.

శిబిక డిగ్గనుఱికి జేపెట్టి సాష్టాంగ
నమన మాచరించి యమలినాంత
రంగుఁ డగుచు నిలిచి బ్రాహ్మణుబ్రమోలను
బలికె నిట్లు భక్తిభావుఁ డగుచు.

"శిబిక విడువుండు సామి! మీచేతఁ గనక
నన్ను మోఁపించితి మదంబునను మహాత్మ!
తొడరి నేఁ జేసినట్టిదుండుడుకు సైచి
మేయుఘుమ్ము నన్నుం జెందనీయకయ్య!

స్వామి! తా మెవ్వరో? సర్వసంగములకుఁ
దొలఁగఁబాఱినవా రవధూతవరులు
మీమహత్వంబుఁ దడవక మేర మీఱి
నెఱసు లిపు డంటి వాని మన్నింపవలయు.

జడునివోలె నిగూఢవిజ్ఞానుఁ డగుచు
నొంటి నిటు లుంట కేహేతువో మహాత్మ!
యోగయుక్తంబు లీ వాదుయుక్తు లెల్లఁ
బరమతత్త్వార్థగుంఫితభాసురములు.

రక్తుఁడవు నయి లోకనిరీక్షణార్థ
మకట! యవ్యక్తలింగుండవై చరించు
కపిలుఁడవ యేమి? యట్లైనఁ గలదె నాకు
ఆడఁబోవుతీర్థం బెదు రైనయట్లె.

ఆత్మవిద్య నెఱుఁగ నాకపిలాశ్రమం
బరుగుచున్నవాఁడ నగుచు నడుమ
నిన్ను వంటిపూజ్యు నిందింపఁ గడఁగితిఁ
బాతకుఁడను దుఃఖభాజనుఁడను.

పూని యసమర్థులైనమాబోఁటివారు
త్వాదృశమహాజనావజ్ఞఁ దక్షణంబె
యణఁగుదురు గాన నోమహాత్మా ! కృపాళు !
ఈవు దయఁ గని నన్ను క్షమింపుమయ్య.

ఆత్మబోధ మొసఁగి యజ్ఞాన ముడిగించి
యిపుడు నన్ను దెల్ప నీశ్వరుండె
నిన్ను జూపినాఁడు నిక్కువ మో యవ
ధూత ! యుద్ధరింపఁ దొడరుమయ్య.

అనుచు మిక్కిలి గుంది యహంత డింది
యున్నఱేని దయాదృష్టి నొప్పఁ గాంచి
యెఱుక లేఁ డయ్యొ రాజు బోధింతు నిపుడె
తత్త్వ మితిహాసపూర్వకదర్శనముగ.

అనుచు లోఁదలంచి యాతని మన్నించి
వీడి శిబికఁ, జెట్టునీడఁ జేర్చి
అవనిపాలు; నీరహస్యంబు నాస్థతో
నాలకింపు రాజ ! యనుచుఁ జెప్పె.

అధిగతాద్వైతతత్త్వుఁ డభ్యస్తసకల
ధర్మకర్ముఁడు, మౌని, విధాతృసుతుఁడు,
ఋభుఁ డనుమహర్షి తొల్లి వర్తిల్లుచుండు
శిష్యుఁడు నిదాఘుఁ డనువాఁడు చేరి కొలువ.

ఒక్కయద్వైతవాసన దక్క సకల
మైనసుజ్ఞానమును దెల్పి యతని ధన్యుఁ
జేసె గురుఁ; డాతఁ డొజ్జలశాసనమున
నొక్కపురిఁ జేరి గేస్తయి యొప్పుచుండె.

అబ్దములు వేయి యతఁడు గార్హస్థ్యవిధుల
నాచరించుచుఁ బత్నితో నలరుచుండఁ
గుదిరెఁ గాఁబోలు నాఁటికి గురునికరుణ
అతని కద్వైతముం దెల్ప నరిగె ఋభుఁడు.

పోవుసరి కాపురీవరభూపవరుఁడు
మదగజము నెక్కి సకలసామంతపౌర
సైన్యసహితుఁడై వాహ్యాళి సాగుచుండెఁ
బురమువీథుల జనులు క్రిక్కిఱిసి నడువ.

ఫలసమిత్కుశభారము తలను దాల్చి
శిష్యుఁడు నిదాఘుఁ డింటికిఁ జేరుకొనుచు
రాజసేనాతిసమ్మర్దరభసమునకు
నోడి తెరువు తొలంగి కూర్చుండె నొకట.

అతని గుర్తించి గురుఁడు సాష్టాంగపడుచు
ఇచట నాయాసపడు చుంటిరేల సామి ?
అన; నిదాఘుఁడు కానవే యవనిపతిని
సేనలను, జనసమ్మర్దమేని కనవె ?

అనఁగఁ బ్రచ్ఛన్నుఁ డగుగురుఁ డడిగె నతని
ఎవ్వఁ డవనినాథుఁడు ? బల మెద్ది ? తెలియఁ
బలుకు మనఁగ; నేనుంగుపై వాఁడు ఱేఁడు,
నివియె బలములు నడచుచున్నవియె యనియె.

రా జనఁగ నెవ్వఁడో ? సింధురం బనంగ
నెద్దియో ? వివరముగ బోధింపవయ్య !
వీరలు పృథక్స్వరూపవికారులుగను
న్నవా రెవ్వ రెట్టిరో యెన్న మనిన.

"మీఁద నున్నవాఁడు మేదినీపతి, క్రింద
నున్నయది గజంబు చిన్నబిడ్డ
యైన నెఱుఁగనేర్చు ననినఁ గ్రిందును మీఁదు
తెలియఁ బలుకు మనఁగ నలిగి యతఁడు.

ఋభుని మెడ వంచి, వీపుపై నెక్కి, నేను
నృపునిగతి మీఁద నున్నాఁడ; నీవు గంధ
నాగమునుబోలెఁ గ్రింద నున్నాఁడ వనిన
అనిదాఘునితో ఋభుం డనియె మఱియు."

తెలుపు మన్నంత నెదియొ సందియము గదురఁ
బలికెదవుగాని స్పష్టత తోఁపకుండె!
ఈవు నే నంటి వీ వన నెట్టి దగునో?
నే ననఁగ నెట్టిదో నాకు నేర్పుమయ్య!

ప్రశ్న విన్నంతలోన యాబ్రాహ్మణుండు
'తత్త్వమసి సోఽహ' మనెడి వేదాంత వాక్య
ములయథార్థము నిజచిత్తమునకుఁ దట్టి
యేక మైనయద్వైతము నెఱిఁగి పిదప,

నడిగ నుఱికి పాదపద్మంబులం బడి
మద్గురుండ వీవు మాన్యచరిత !
ప్రత్యభిజ్ఞ మాలి పతితుఁడ నై యిట్టి
యెగ్గు సేసితిని క్షమింపుమయ్య !

ఈవు ఋభుఁడవు; కానినాఁ డెవరి కిట్టి
శాంతభావ మద్వైతసంస్కార ముండు ?
శిష్యుఁ డపరాధి యయ్యె శాశించి వీని
పాపనిష్కృతి పలికి కాపాడు మనఁగ.

"ఏను ఋభుఁడ నగుదు నీవు చేసినపూర్వ
సేవవలన మిగులఁ జిత్త మలరి
బ్రహ్మవిద్య తేటపడ నుపదేశింప
వచ్చినాఁడ గౌరవంబు గదుర."

అబ్బె నద్వైతసిద్ధి నీయంతరాత్మ
"కేక మేవాఽద్వితీయ" మంచెఱిఁగి నిలుపు
మనుచు శిష్యుని దీవించి యరిగె ఋభుఁడు
ఆనిదాఘుఁడుఁ బొందె బ్రహ్మానుభూతి.

మాయవశత నీసంసారమార్గమందు
పడక నే రాజు ననుభావ ముడుగఁ బెట్టి
గురుకరుణ గన్నయానిదాఘునివిధాన
సంచరించుము జ్ఞానివై సార్వభౌమ !

అనుభవైకవేద్యమ్ము వేదాంతగమ్య
మనవగతము వచోతీత మాత్మతత్త్వ
మట్టిదెఱుకను బొంది తీ వనఘచరిత !
నిష్ప్రమాదస్థితిని నుండ నేర్వు మింక.

అనుచు భరతుఁ డతని నాశీర్వదించుచు
సర్వతీర్థయాత్ర సలుపు మనుచుఁ
జనె యథేచ్ఛముగను; సత్యము నిర్వ్యాజ
బంధుజనులు గారె పరమమునులు ?

సర్పదష్టుఁ డైనజనుఁడు మహౌషధ
సేవనమునఁ దిరిగి జీవనమ్ము
పొంది పొదలినట్లు భూపతి యజ్ఞాన
భావ ముడిగి జ్ఞానిభావ మందె.

~~~
~~~

# ఉపసంహృతి

అది హిమాద్రి మహోన్నతహైమశిఖర
రత్నదీధితి దినమణిరహి వహింప
దేవతాత్మత లోలోనఁ దేజరిల్లు
జంగమస్థావరాత్మకస్వామి యితఁడు.

ఆర్తిగుండెలవాఁ డయ్యు రక్తిఁ గొనుచు
సుతసతీయుతగార్హస్థ్యశోభ నెఱపి
కాలకంధరు నిళ్ళఱికంపుటల్లుఁ
గాంగఁ జేకొన్న సిద్ధసంకల్పుఁ డితఁడు.

నిబిడతరతరుషండమండితవిశాల
కూటమే జటాజూటమై వాట మెసఁగ
హైమమయమహోన్నతమూర్తి యసమశుభగ
భస్మపాండురదేహమై పరిఢవిల్ల.
విలయసమయాచలస్థితివిలసనమ్ము
సారసర్వాంగపరమనిశ్చలత దెలుప
సకలజీవజీవాధారసత్రప్రవృత్తి
పరమజీవకారుణ్యవిస్తరత దెలుప
శిఖరభూతశివాకారచిహ్న మొన్న

నమలహృదయశివస్థితి యట్టు లుండ
రంగదుత్తుంగభంగగంగావతరణ
మమలగంగావతరణ మై విమలపఱుప
స్థిరనిరంతరగహనసంస్థితియుఁ గూడ
చిరనిరంతరగహనసంస్థితిని జాట
నీ వొకమహర్షి వలెనె కన్పింతువయ్య.

ఎంద ఱెందఱుమునులు బ్రహ్మర్షివరులు
పరమయోగివర్యులు దిగంబరులు నీదు
నుదరకుహరాల లీన మై యుండిరొక్కొ ?
గూట మణఁగుపులుంగులకూన లట్లు.

ఓమహాసత్వమూర్తి ! ఓహరోగిరీంద్ర !
ఐక్య మందెనటోయి నీయందు నాఁడు
జడభరతయోగి, సాత్వికసార్వభౌముఁ
డతనిప్రతిబింబ మీవు కానౌదువోయి ?

సంపూర్ణము.

రామకృష్ణాప్రెస్, కాకినాడ.

# సమర్పణము

సీ. భీమనాథేశ్వరధామదక్షారామ
పాఠశాలాప్రాప్తబాంధవులము
అపరపాణినిశ్రీజయంతిసూర్యబుధేంద్ర
పావనసేవావిభాసితులము
నానామహాకావ్యనాటకాలంకార
పఠనచింతనసహపాఠకులము
షోడశాబ్దపరీతసుస్నిగ్ధసౌహార్ద
మాననీయపవిత్రమానసులము

గీ॥ అట్టిసంబంధకలితుల మాట తలఁచి
కృతి యొసంగినఁ దా బహూకృతి నొసంగె
మెచ్చి రెండునూటపదార్లు; మేడవరపు
సత్యనారాయణునిసాటిసఖులుగలరె ?

మ. కలుగంబోవదు ధర్మవర్తనము, నిక్కంబందుపై విత్తమున్
గలుగంబోవదు పూర్వపుణ్యములఁదక్కం బెక్కులిక్కట్టులన్;
తెలియంబోవదుసత్కవిత్వరుచియుం తే, వేలసంవత్సరాల్
తలక్రిందై తపమాచరింపఁ గృతి నందంగల్గునే యేరికిన్ ?

గీ. తల్లి నీకు కామేశ్వరి తండ్రియెన్న
భవ్యగుణుఁడు సుబ్రహ్మణ్యపండితుండు
ఇట్టిదంపతికి జనించినట్టినీకు
పుణ్యచింతన మేరీతి పుట్టకుండు ?

సీ. మొదటినుండియు గుప్తముగ దానధర్మముల్
చేయనేర్చినయట్టి చేయినీది
గురుభక్తి పరమసోదరరక్తి సత్యప్ర
పత్తి గల్గినయట్టి ప్రకృతినీది
ఆదినుండియు వైదికాచారపద్ధతి
యెఱిఁగివర్తించెడి యెడఁదనీది
తగుగ్రామవాసుల తలలోనినాల్కవై
మెలఁగనేర్చినయట్టి తెలివినీది

గీ. కనుకనే సిరిసంపదల్ గలిగె నీకు
కనుకనే కీర్తనీయత గలిగె నీకు
కనుకనే భక్తిభావముల్ గలిగె నీకు
కనుకనే పెత్తనంబులు గలిగె నీకు.

క. నీచెలిమికి నాచెలిమికి
నీ చిఱుకావ్యమ్ము లక్ష్యమే యయి భువిలో
నాచంద్రతారకముగా
ప్రాచుర్యము గాంచుఁగాత పరమేశుకృపన్.

